ఈ సంచికలో ...




సృజన, హనుమకొండ 506001 — విడిప్రతి రూ 3

జూన్, 164 — సంవత్సరచందా రూ 30



SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Nagendra Press Vijayawada
for Venkataramana Mudranalayam, Warangal

# చంపుడు పందెం

రేసుగుర్రాలు, సినిమా హీరోలు రికార్డులు అధిగమించగలిగినంత కాలమే నిలుస్తారు. సినిమాల్లో ఉన్నంతకాలం ఆ రికార్డు నిలుపుకున్నాడు ఎన్టీఆర్. రాజకీయాలను సినీమాయకు గురి చేస్తూనే ఆయన ప్రజాజీవితంలోకి వచ్చాడు. రాముడిగా, కృష్ణుడుగా, రాజుగా, జానపద వీరునిగా, రాక్షసుడుగా, విలన్‌గా తెరమీద యుద్ధాలు, ఫైటింగులు చేసి చేసి లక్షల అడుగుల రీళ్ళ హింసతో ప్రేక్షకుల మనసులు సుడిబడేలా చుట్టేసాడు. పచ్చీసు ఆటలో ఎదుటివాళ్ళ కాయనొక దాన్నయినా చంపందే చంపుడు పందెం పుట్టి కాయ 'ఇల్లు' చేరదు. ఎన్టీఆర్‌కు ఎన్నికలవుతుండగానే పాదిరికుప్పంలోనే చంపుడుపందెం పుట్టింది.

కన్నీరు పెట్టుకొనే విలువేదయినా మిగిలివుంటే కరిగిపోయేంత అమానుష క్రూర దౌర్జన్యాలను పార్లమెంటరీ రాజకీయాలు, పామరజన హృదయరంజక సినిమాలు పెథడిన్ లాగానో, 'నల్లచక్కెర' లాగానో ప్రజల నరాల్లోకి ఎక్కించాయి. చైతన్యం గలవారు ఆ బండబారిన గుండెల మీద ఆగ్రహం నూరుకోవాల్సిందే తప్ప ఒక ప్రాణం కోసం ప్రాణం ఆరాటపడే స్థితి పోయింది.

బందర్‌లో ఏదో వేడుకకు పోతున్న పోలీసుమంత్రి కారు కింద ఒక పిల్లవాడు పడిపోయి చనిపోయాడు. 'ఎన్ కౌంటర్' లో రోజుకో నక్సలైట్ చనిపోతున్నాడు. పత్రికల వారిని విందు భోజనానికి పిలవాలని ఆరాటం వుందిగాని మంత్రిగారికి మామూలు (రోటీన్) మరణాలపట్ల సూటిగా ఆయన జవాబుకూడ లేదు.

ముఖ్యమంత్రిగా చెన్నారెడ్డి వచ్చినాక 1980 సెప్టెంబర్‌లో మళ్ళీ 'ఎన్ కౌంటర్' హత్యలు మొదలయినవి. సాయంకాలమే వరంగల్ నగరంలో సుభాష్ విగ్రహం దగ్గర ఇద్దరిని అరెస్టుచేసి గొర్రెకుంట తోటలో కాల్చివేస్తే వరంగల్ నగర పరిసరాలకు తూటాల ధ్వనులు కూడా వినొచ్చాయి. సరిగ్గా అట్లాగే హనుమకొండ పట్టణంలో కోర్టుకూ, పోలీసు హెడ్‌క్వార్టర్స్‌కూ, జిల్లా బస్‌స్టేషన్‌కూ మూడు దిక్కులా కూత పెట్టుదూరం లోనే భూపతిరెడ్డి, సారయ్య లను ఒక అడ్వొకేట్ ఇంట్లో అరెస్ట్ చేసి ములుగు అడవులకు తీసుకవెళ్ళి కాల్చేసారు పోలీసులు మే 27 వ తేదీన. సూర్యాపేట పట్టణంలో జాతీయ రహదారి మీద వున్న హోటల్లో సాయంకాలం చాయ్ తాగుతున్న నయపాల్‌రెడ్డి, లింగన్న అనే విద్యార్థులను పట్టుకొని పట్టణ పరిసరాల్లో కాల్చేసారు. అప్పుడు బస్వాపూర్‌లో, జగిత్యాలలో జరిగిన 'ఎన్‌కౌంటర్' లు పట్టపగలు జరిగినవే. సారంగపాణి హత్య విషయంలో వరంగల్ పోలీసులు ఎంత చాపచుట్టు భేతాళ శవంకథ చెప్పారో జగిత్యాల 'ఎన్‌కౌంటర్' గురించి కరీంనగర్ పోలీసులు అంతటి క్రైం థ్రిల్లర్ సృష్టించారు.

ఉదయం పదకొండున్నరకు పట్టణ పరిసరాల్లోనే కాల్చేసిన ఘనతమాత్రం

ఎన్టీఆర్ దే. (పోలీసుల కథనమే నిజమైతే సినిమాఫక్కీలో మోటర్ సైకిల్‌పై పోతున్న వాణ్ణి వెంబడించి కాల్చారు.)

అంజయ్య హయాంలో నలగొండ జిల్లా మంచినీళ్ళ బావి దగ్గర నలుగురు నక్సలైట్లను పోలీసులు 'ఎన్‌కౌంటర్' చేసారు. కొండాపూర్‌లో ఐదుగురిని పట్టుకొని చేతులు వెనక్కి విరిచి కట్టి కాల్చేయడంతో ఈ రికార్డునేకాదు, గిరాయిపల్లి అడవుల్లో నలుగురు నక్సలైట్లను చెట్లకు కట్టి కాల్చేసిన వెంగళరావు రికార్డును కూడ ఎన్టీఆర్ సునాయాసంగా బ్రేక్ చేసాడు.

ఇంద్రవెల్లిని బహిరంగ విషాదమన్నాడు గానీ అన్నపురెడ్డిపల్లిలో గిరిజనులకు ఇంద్రవెల్లిని రుచి చూపాడు. (ఈ సంవత్సరం ఇంద్రవెల్లిలో మనోరంజన్ మొహంతీ వంటి మేధావులకు కూడా ఇంద్రవెల్లి రుచి చూపాడు.) ఆత్రం అశోక్, పల్లె కనకయ్య, హరిభూషణ్‌లు మొదలు కొని చంద్రన్న వరకు గిరిజనుల్లో (వాళ్ళు గోండులు, లంబాడాలు, కోయలు, కొండదొరలు-ఎవరైనా కావచ్చు-అక్కడ పక్షపాతం లేదు) పనిచేసే వాళ్ళను నిద్రలో వున్నా, అనారోగ్యంగా వున్నా పట్టుకొని కాల్చేసేంత దీక్ష ఎన్టీఆర్‌కు. ఈ దీక్షనే మొన్న కమలాపూర్‌లో మహారాష్ట్ర ప్రభుత్వానికి పంచి గడ్‌చిరోలీ గిరిజన రైతుకూలీ సభలు నిరోధించగలిగాడు. నిన్న మధ్యప్రదేశ్ ప్రభుత్వానికి ఈ దీక్షనే పంచి తెలుగు యువకులు గణపతి, శివకుమార్‌లను చంపించాడు. ఇవ్వాళ రాజమండ్రి రైతుకూలీ సభలపై విరుచుకపడి 'తెలుగు ఆడపడుచులను' కేంద్రం పడగొట్టిన తన ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి తోడ్పడిన పౌరహక్కుల బాధ్యులను, డాక్టర్లను, లాయర్లను, లెక్చరర్లను రెండు వారాలుగా పోలీసు లాకప్పులో తోసేసాడు. విద్యార్థి యువకులపై నిర్బంధం చెప్పనక్కర్లేదు. గోదావరి, విశాఖ ఏజెన్సీ ఏరియాలో గిరిజనులు సభకు వస్తే 'ఇంద్రవెల్లి చేస్తామ'ని, కాల్చేస్తామని జీపుల్లో తిరుగుతూ మైకులు పెట్టుకొని ప్రచారం చేసారు పోలీసులు. ఎన్టీఆర్ పోలీసులే.

ఒక మారుమూలగ్రామంలో ఒక కానిస్టేబుల్ ప్రవర్తించే తీరు నా ప్రభుత్వానికి గీటురాయి అన్నాడు ఎన్టీఆర్. ఊళ్ళో పోలీసుస్టేషన్ వుండడమంటే అది రేప్ సంస్కృతికి, లాకప్ హత్యల నాగరికతకు గీటురాయని ఆయన ముప్పై నెలలయినా నిండని పాలన రుజువు చేసింది. పోలీసుకాల్పులు, పోలీసు స్టేషన్‌లలో హత్యలు, లైంగిక బలాత్కారాల విషయంలో ఎమర్జెన్సీకి ముందున్న కాంగ్రెస్ ప్రభుత్వాలు, ఎమర్జెన్సీ లోనూ వున్న వెంగళరావు ప్రభుత్వం తలలు ఎత్తుకో లేనన్ని పాయింట్స్ స్కోర్ చేసాడు ఎన్టీఆర్.

వరంగల్‌లో సారంగపాణిని, నిజామాబాదులో అమరనాథ రెడ్డిని వీధుల్లో పరిగెత్తించి చంపిన తీరు డెబ్భైలలో కలకత్తా నగరంలో జ్యోతిబసు పోలీసులు నక్సలైట్ యువకులను వేటాడిన చేదు జ్ఞాపకాలకే కడుపుదేవేలా చేస్తుంది. బావిలో

చేదవేసి భూక్యాకిషన్ చేదమీదనే గుండుకు గురయ్యాడు. నాగళ్ళు కట్టేవాళ్ళు నాగేటి చాళ్ళలో, మోటలు కొట్టేవాళ్ళు మోట మీద, తాటిచెట్టు ఎక్కినవాళ్ళు దిగుతూ దిగుతూ మధ్యన విసునూరు బాబు దొర గుండుకు గురయిన విషయం నిజాం నిరంకుశ జమీందారీ జాగీర్దారీ ఫ్యూడల్ రాచరిక వెట్టి చాకిరీదశ. ఇప్పటిది కైకేయి స్వార్థం కోసం వనవాసం వెళ్ళి తిరిగి వచ్చిన రాముడు ప్రజామోదంతో పట్టాభిషేకం చేసు కొని అశ్వమేధం చేస్తున్నదశ. ఇది రామరాజ్యం. ఈ రామరాజ్యం అన్ని రావణ రాజ్యాల రికార్డులను అధిగమించింది.

ఈ పురాణ పురుషుడు శవపూజ చేస్తాడో, అశ్వమేధం చేస్తాడో పరిశోధనలు, ఖండనలు అక్కర్లేదు. నరమేధం చేస్తూనే వున్నాడు. సాధారణ ప్రజానీకం (ఈ దేశంలో వ్యక్తిగత ఆస్తిలేని వాళ్ళంతా దొంగలు, ఖూనీకోరులు, నేరస్తులు) విషయంలో లాకప్‌హత్యలు, నక్సలైట్లు, వాళ్ళ సానుభూతి పరుల విషయంలో 'ఎన్ కౌంటర్'లు పాలసీగా నిర్ణయించుకొని అమలు చేస్తున్నాడు ఆయనకేమీ తెలియదు. పోలీసులకు ఫ్రీహాండ్ (పూర్తి స్వేచ్ఛ) ఇచ్చాడన్నా అదే అర్థం. అసలు 'శాంతిభద్ర తలు' ముఖ్యమంత్రి పోర్టిఫోలియోకాగా, తనదికాని బాధ్యతలు నెత్తినెత్తుకొని పోలీసు మంత్రి ముఖ్యమంత్రిని ఇరకాటంలో పెట్టడానికే ఈ పనులు చేస్తున్నాడని అనేవాళ్ళు, తెలుగుదేశం ప్రభుత్వాన్ని బదనామ్ చేయడానికి కొందరు పోలీసులు అధికారాలు స్వైరవిహారం చేస్తున్నారనేవాళ్ళూ తమకు తెలియకుండానే పోలీసు యంత్రాంగం చేతుల్లో ఆరుకోట్ల ఆంధ్రుల అభిమాన నాయకుడు ఒక పాపులర్ డాల్ అని ఒప్పు కుంటున్నారన్నమాట. పాలక వర్గాల కాంగ్రెస్ బాక్స్ ఇంక ఒక్క ఆట ఆడడానికీ వీలులేక వెనక్కి తిరిగిపోగా వచ్చిన కొత్త బాక్సాఫీస్ హిట్ ఫార్ములా అని తేలి పోతున్నదన్నమాట.

అయితే ఇందిరాగాంధి నినాదాలన్నీ అరిగిపోయి నియతంగా తేలిపోయినట్లు గానే మూడేళ్ళు తిరగకుండానే ఈ 'బొబ్బిలిపులి' తన వాగ్దానాల పిల్లలను తినేస్తున్నాడు. అందులో ఆయన ఒకటి రెండు సార్లంటే అనేక సందర్భాల్లో కోట్ చేయబడ్డ 'నక్స లైట్లకు జోహార్లు' కాసేపటికి సినిమాడైలాగు అనే అనుకుందాం. కాషాయ, ఎర్ర జెండాల బరాబరులతో (ఎంవి రమణారెడ్డి మొదలు ఇంద్రారెడ్డి వరకు ఈ ఎర్రరంగులో మాజీ నక్సలైట్లు కూడా వున్నారు) ఢిల్లీ కోటను ట్టుకోవాన్ని ముప్పై రోజుల్లో జూబిలీహాలును మాత్రంమళ్ళీ పట్టుకున్నాడు.

ఇపుడింక ఆయనకు ప్రజాకర్షణకు వ్యాపార భోజనాలు అక్కర్లేదు. ఆర్‌టిసి మొదలు రోడ్ బ్రిడ్జిలదాకా ప్రైవేట్ యాజమాన్యానికి ఒప్పచెప్పవచ్చు. చెట్టుకుపన్ను, పంటికి (తినుబండారాలకు) పన్ను, నేలకు పన్ను వేసి బొక్కసాన్ని నింపుకొని అశ్వమేధాలు చేయవచ్చు.

ఈ అధికారానికి మిత్రపక్షాలు అడుగులొత్తవచ్చు. కౌన్సిల్‌ను రద్దుచేసి కేంద్రం గుర్తింపునివ్వవచ్చు. ఈ అధికారాన్ని ప్రశ్నించిన నక్సలైట్ల నణచడానికి సిఆర్‌పి బలగాలను, కోట్ల కోట్ల రూపాయల బడ్జెట్‌లను ఇవ్వవచ్చు. కాని ఇవన్నీ భూమిదున్నేవానికి భూమిలేకుండాచేసి భూమిమీద లేనివానికి అధికారమిచ్చే వ్యక్తి అస్తిత్వాన్ని ఎంతకాలం కాపాడగలవనేది అసలు ప్రశ్న.

నేలమీద కాలుమోపి మాత్రమేకాదు; శరీరంతో, చెమటతో, నెత్తురుతో, కళ్ళలోని ఆశతో, మనసుతో, గుండెలలోని ఎర్రజెండాతో కష్టజీవి భూమితో అనుబంధం పెట్టుకున్నాడు, అతని కాళ్ళకిందినుంచి భూమినీ, నోటిముందు నుంచి బుక్కనూ 'ఎన్‌కౌంటర్' చేస్తే జరిగే పరిణామం గుండెలోని ఎర్రజెండా మరింత ఎరుపెక్కడమే. ఎన్టీఆర్ 'ఎన్‌కౌంటర్'లలో 'దున్నేవానికి భూమి' కోసం పోరాడుతున్న వాళ్ళరక్తమే చిందిందికానీ ఆస్తి పర వర్గాల ప్రయోజనాలను కాపాడుతున్న వాళ్ళకు గాయాలైనా కాలేదు, నిజమే ఇవ్వాళ్టికిది ఎన్టీఆర్ రికార్డే.

కానీ తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటాలలో, మూడువేలమందిని నెహ్రూ పటేల్ సైన్యాలు పోలీసులు హతమారిస్తే శ్రీకాకుళ ఉద్యమం ఉదయించలేదా? శ్రీకాకుళంలో మూడువందల యాభై మందిని చంపితే జగిత్యాల జైత్రయాత్ర ఆగిందా? సమస్యలకు బులెట్లు పరిష్కారమయితే ఓట్లెందుకు; ఇంక పాలకవర్గాలు సాయుధంగా తేల్చుకోవచ్చు. 'ప్రజాయుద్ధ' పంథాలో చివరిదశలో ప్రజాసైన్యాలు పాలకవర్గ సైన్యంతో స్థావర యుగచేస్తాయి. ఆ "ఎదురుకాల్పుల" దాకా ఎన్టీఆర్ అధికారంలో వుంటే అప్పుడాలోచిద్దాం ఆయన రికార్డు సంగతి. ఇప్పటికయితే తనకళ్ళముందే సర్కస్ మృగమై తిరుగుతున్న శ్రీకాకుళం/ఎమర్జెన్సీ ఫేం వెంగళరావునుంచి ఎన్టీఆర్ సుదూర భవిష్యత్తు పాఠాలు నేర్చుకుంటున్నట్లులేదు. తానుగా నేర్చుకోనివానికి చరిత్ర తానై గుణపాఠం చెప్పితీరుతుంది.

## విజ్ఞప్తి

సృజన అమ్మకంకోసం కొత్తగా పుస్తకాలు పంపించవద్దని ప్రచురణకర్తలకు, రచయితలకు విజ్ఞప్తి. ఇప్పుడు ఉన్న స్టాకు అయిపోయేదాక అమ్మకాలు కొనసాగుతాయి. సృజనవద్ద ఉన్న పుస్తకాల వివరాలు అప్పుడప్పుడు సృజన సంచికల్లో ప్రచురిస్తుంటాం.

— సాహితీ మిత్రులు.

# ఎన్‌కౌంటర్

కె. రాములు

1

నిద్రపోతున్నవాడ్ని నిద్రలోనే కాల్చేయడం
ఎన్‌కౌంటర్ అర్థమయితే
నేను ఎన్‌కౌంటర్‌లోనే చంపబడ్డాను

పడుకున్నవాడ్ని నిద్రలేపి
పెడరెక్కల విర్చిపట్టి
చెట్లకు కట్టి
రహస్యాలు కక్కుండని రక్తాలు కక్కించడం
ట్రిగర్ నొక్కడమే ఎన్‌కౌంటర్ అయితే
నేను ఎన్‌కౌంటర్‌లోనే తూట్లుపడ్డాను.

దాహం తీరని చేద
పట్టుదప్పిన చేతిలోంచి, నిండా మునిగిపోయి
బావి గిరక శబ్దం మాత్రమే మిగిలి
'బిడ్డలారా! పోలీసులు' అన్నమాట
నీ తుపాకీ శబ్దంలో నిశ్శబ్దమై పోవడమే
ఎన్‌కౌంటర్ అయితే
నేను ఎన్‌కౌంటర్‌లోనే కాల్చివేయబడ్డాను

ప్రజాస్వామ్యాని కర్థం
దొరలూ దొడ్డవారే అయితే
పిడికెడు ఆసాముల శాంతి భద్రతలకోసం
నేను 'అదుపు' చేయబడ్డాను

సాయుధ పోరాటంలో
నిజంగా ఎదురు కాల్పు లుండవా అంటే
దొంగ చాటుగానే తప్ప
వాడెప్పుడూ
ఎదురుబడి తలపడలేదు

కామ్రేడ్స్
మిత్రులారా
నా ఒంటి నిండా ఎర్రజెండా కప్పండి

స్థూపాల జెండాల మీద చిరకాలం నేను రెపరెపలాడుతాను
నాకునేనుగా అమరత్వం రాసుకున్నవాడ్ని
నన్నే మృత్యువూ కబళించలేదు.
ప్రజలే మా ఉక్కుకోట
పేల్చే మందుగుండు
ఇంతవరకు ఎక్కడా కనిపెట్టబడలేదు

నా కళ్ళమీద వెలుగుసూర్యులు పర్చుకున్నారు
ఈ కళ్ళ కలలు ఫలించేందుకు
మూసుకున్న నారెప్పలమీద రక్తాల్ని వర్షించండి
ఇది సంధి కాలం
త్యాగాల బలిదానాల మాల కట్టండి
ప్రజాహృదయాల్ని బీటలు వార్చే ఏ బెదిరింపు చర్యా
ఇంతవరకు బతికి బట్టకట్టలేదు

ఇవాల్టి అశ్రుసముద్రాల్ని అదిమి పట్టండి
పెనుతుఫానై విరుచుకు పడాల్సినరోజు ముందున్నది

**2**

నెత్తుటితో తడిసి ముద్దయిన
మానేలను ముద్దాడేందుకు నువు రావే
దాని కడుపు కాల్పుల
దుఃఖాలు వినేందుకు నువు లేవే
నీకా దృశ్యం అవగతమయ్యే దెట్లా మరి !

సూర్యుడ్ని పిలువనా
చంద్రుడ్ని పిలువనా
చుక్కల్ని పిలువనా
గాలిని పిలువనా ఏరును పిలువనా
దీన్ని దేన్ని సాక్ష్యానికి రమ్మని పిలువను
వేన్ని సాక్ష్యానికి రమ్మని పిలువను

ఆకాశాన్నంతా కాకీమబ్బు కమ్మేసింది
సూర్యుని మీదికి తుపాకీ ఎక్కుపెట్టి
చంద్రున్నను చంపేసి

చుక్కల్ని రాల్చేసి
గాలిగాలంతా ఖాకీవాసన కముగుకున్నది

ఏరుల దారుల్నిండా
ఉక్కు శిరస్త్రాణాల ఇనుపబూట్ల నాడాలు
నీ కళ్ళకేమీ మరి సాక్ష్యాధారాల గంతలు
నీకా దృశ్యం కనబడదు

3

చలికి మబ్బుదుప్పటి కప్పుకున్న చంద్రుడు
చీకట్లో మునగదీసుకున్న పొలాలు
పొలాలు దున్నటమే పనిగా పెట్టుకున్న నాగటి కర్రలు
మాటల మధ్యలోనే
అలసి సొలసి నిద్రిస్తున్న మట్టి బిడ్డలు

వాళ్ళు
మోచేతులతో మోకాళ్ళతో
ఆకలి కడుపులను అదుముకుని పడుకున్నారు
జనం బరువు నిశ్వాసాలను
బతుకు విశ్వాసాలను
వెచ్చదనంగా నిలువెల్లా పొదుముకుని పడుకున్నారు

వాళ్ళు
మారుతున్న దృశ్యం కన్పిస్తున్నదా
గుండెల మీద ఒదిగిన బిడ్డలు
నేల ఒడిలో శాశ్వతంగా ఒరిగిపోయిన దృశ్యం
గగనమంతా పొగ కమ్మి
నెత్తుటి మడుగులో ఎర్రగా తేలిన దృశ్యం
తర్వాత
అంతటా ఎన్‌కౌంటర్ నిశ్శబ్దం

4

అది కొండాపూర్ కావచ్చు
బస్వాపూర్ కావచ్చు
బొమ్మిరెడ్డిపల్లి లొద్‌పల్లి కావచ్చు

నా మిత్రుడు చెప్పినట్లు
అది రేపు వరంగల్ కూడా కావచ్చు
కాలేదా
ఇక్కడ ప్రాణాన్ని లాకప్ చేయలేదా
సుదర్శన్ సాక్ష్యంగా మాట్లాడుతున్నాను
కడిపికొండ కడుపులో కత్తుల్ని దూర్చి
సోమిడి కంఠంలోకి సన్నీలు గుచ్చి
నెత్తురు చల్లబడ్డదనుకున్నావు
నిప్పు చల్లారిందనుకున్నావు
ఏటూరు నాగారం అడవుల్లో
సుదర్శన్‌ను పోల్చుకొని
వరంగల్‌కు చూపిన
సారంగపాణిని తరిమి చంపావు
నడకలు పరుగులు గెంతులుగా
వచ్చే విప్లవాన్ని చంపేసి
చాపలో చుట్టొచ్చు ననుకున్నావు
హిరణ్యాక్షునిలా మా కాళ్ళ కింది
భూమిని అపహరించొచ్చనుకున్నావు
రాక్షసీ !
అది నీ లక్షణం
సారంగపాణి వినదిస్తూనే వుంటాడు
ఇది మా ఆశయం

5

వర్తమాన అగ్ని పర్వతం మీద నిలిచి
కొడవలిని ట్రిగర్‌గా సంధించి
సుత్తిగా బిగిసిన పిడికిట్లో
తుపాకీ నెత్తిపట్టి సవాల్ చేస్తున్నాను
నిదురలోనో నీళ్ళు తాగేప్పుడో
చేతులు విరిచికట్టో చేర్చబడిన జాడతోనో
'ఎన్‌కౌంటర్' - వ్యక్తుల్ని చేయగలవు గానీ
వ్యవస్థకు ముంచుకొస్తున్న మృత్యువు నుంచి
ఎదురు వస్తున్న ప్రజాయుద్ధ శక్తుల్నించి
ఆత్మరక్షణ చేసుకో చూద్దాం

# ఎదల మిమ్ము దాచుకుందుమో

గద్దర్

దొంగ ఎదురు కాల్పులల్లో
కనుమూసిన కూనలార
రాడికల్ల వీరులార
రైతుకూలి బిడ్డలార
ఎర్రపూలదండలేతుమో
మా బిడ్డలార
ఎదలమిమ్ము దాచుకుందుమో
మా బిడ్డలార
పొరంమీద నడిసెటపుడు
పొంగినాట్లు వేసెటపుడు
కొడవలెత్తి కోసెటపుడు
మోపులెత్తి మోసెటపుడు
మా మనసులల్లొ
కలుకు మంటిరో
మా బిడ్డలారా
మా సెలకలల్ల
మొలకలయితిరో
మా బిడ్డలారా ॥ఎర్రపూల॥
జిల్లాలోని పల్లెలల్లొ
పల్లెలోని గుడిసెలల్లొ
పొయిమీద కుండెక్కలేదు
బాలెంత పాలియ్యలేదు
అంబా అంటు లేగలేడ్చెరో
మా బిడ్డలారా
అన్నలేరని పిల్లలేడ్చిరో
మా బిడ్డలారా ॥ఎర్రపూల॥
కడసారి మిమ్ములనుజూసి
కండ్లకద్దుకుంటామంటె
పుట్టెడు బుద్ధులుచెప్పే
ముద్దుమొహం చూద్దామంటే
బొందల మిమ్ము పెట్టెటపుడు
పిడికెడు మన్నేద్దామంటే
తుపాకులు మాకుజూపిరో
మా బిడ్డలారా
మీ సూపులన్ని రూపుమాపిరో
మా బిడ్డలారా ॥ఎర్రపూల॥
కన్నతల్లి సెంతలేదు
కనిపెంచిన తండ్రిలేడు
ఎంగిలిపాలు తాగిన
తోబుట్టిన తోడులేడు
కొత్తబట్టా మీకులేదురో
మా బిడ్డలారా
నిప్పుపట్టెటోడు లేడురో
మా బిడ్డలారా ॥ఎర్రపూల॥
లంబాడోళ్ళ తండాలోన
అంబలి గటకతాగి
కూలీనాలీ గుడెసెలోల్ల
నలిగంజి మెతుకులుతాగి
కూలీనాలీ నొకటిసేస్తిరో
మా బిడ్డలారా
మా కుడిబుజమోలేవుంటిరో
మా బిడ్డలారా ॥ఎర్రపూల॥
కల్లు సారా తాగిటోళ్ళ
కష్టజీవి కూలీలని

కల్లుగుత్తా పట్టినోణ్ణి
సారాడిపో పెట్టినోణ్ణి
కత్తికల్లు అమ్మేటోణ్ణి
సారలిసం కలిపేటోణ్ణి
జనంముందుకీడ్సి కొస్తిరో
మా బిడ్డలారా
ధరలుదించి మదంవొంచితిరో
మా బిడ్డలారా ||ఎర్రపూల||

పొయిలపుల్ల ఇర్వబోతే
పట్టుకొని తన్నేటోణ్ణి
సుట్టఅకు తెంపబోతే
సెయికిచురుకు పెట్టేటోణ్ణి
గుడిసెమీది పొరకకేమో
కేసుపెట్టి కొట్టేటోణ్ణి
గొర్రె మేక పుల్లరనీ
గొర్రెలమంద మింగినోణ్ణి
చౌకిదారు సారెదారు
జంగ్లాత్ అమీనోణ్ణి
జనంముందు వొంగబెడితిరో
మా బిడ్డలారా
వొంగుముక్కురాపిస్తిరో
మా బిడ్డలారా ||ఎర్రపూల||

నోరులేని జీవులకు
ఊరుకంచె వదిలినారు
ఊరుశికం భూములల్లో
దొరల హుకుం చెల్లదన్రు
దొరల కబ్జలున్న భూమి
ఇరువాల దున్నిచ్చినారు
నాగండ్లకు జెండలు కట్టో
మా బిడ్డలారా
దొరలపట్ట భూమిదున్నితిరో
మా బిడ్డలారా ||ఎర్రపూల||

పట్నమురికి దొరగాడు
పోలీసుల దోలుకొస్తే
సొప్ప జెండు దండుచూసి
సప్పబడి పోవద్దన్రు
నిప్పుబాణ మెదురుగను
నీళ్ళబాణ మేసినట్లు
గడ్డిగాళ్ళ నెడ్డిగాళ్ళ
గన్నులోళె సేసినారు
దొరగాన్ని పోలీసోల్లను
మా బిడ్డలారా
ఊరుసుట్టు ఉరికిపిస్తిరో
మా బిడ్డలారా ||ఎర్రపూల||

పట్టపగలె కాలుస్తున్రు
ఊరా ఇది అడివి అంటే
దొంగ ఎదురుకాల్పులమీద
బహిరంగసభ పెడదమంటె
ఓటడిగిన సుద్దపూసరో
ఒక్కమాట పలుకదాయెరో
గిదేమి అన్యాయమంటెరో
మా బిడ్డలారా
గదేమీకు న్యాయమనెరో
మా బిడ్డలారా ||ఎర్రపూల||

మానవతా విలువలు :

# ఎదురు కాల్పులు

కె. బాలగోపాల్

కొత్తగా అధికారం చేతి కొచ్చిన వర్గాలకు - అందులోనూ కష్టపడకుండ అధికారం చేతి కొచ్చిన వర్గాలకు - అహంకారం విపరీతంగా వుంటుంది. తమతో విభేదించే వాళ్ళ పట్ల అసహనం ఫాసిజం పాళ్ళలో వుంటుంది. ఒక్క ఉద్యమం నడపకుండ ఒక్క పోరాటం చేయకుండ అధికారానికి వచ్చిన వాళ్ళకు ఉద్యమాలూ, పోరాటాలూ అనవసరమయిన విషయాలుగానూ విద్రోహ చర్యలగానూ కనబడతాయి. పాలకవర్గ ప్రతిపక్ష పాత్రను సహితం కొంతకాలమయినా మోయని వాళ్ళకు అభిప్రాయ స్వేచ్ఛ, వాక్ స్వాతంత్ర్యం చులకనగా అనిపిస్తాయి. తమకు ఎన్నడూ అవసరం కానివి, కేవలం ఇప్పుడు తమ పాలనా వ్యాపారానికి ఆటంకంగా అనిపించేవి లేకుంటేనేం ?

అందుకే వసంత నాగేశ్వరరావును పత్రికా విలేఖరులు ఎదురు కాల్పుల గురించి తరచి తరచి అడగగా ఆయన చాలా విసుక్కున్నాడు పాపం. మమ్మల్నీ, మావాళ్ళనీ ఇబ్బంది పెడుతున్న వెధవల్ని చంపేసాం - ఇంత రొటీన్ విషయాన్ని గురించి ఇంతగా చర్చ ఎందుకు ? తెలుగుజాతి మహోన్నతి కోసం మేము ఆవిర్భవించాం. ఆ ఉన్నతికి ఎవరు అడ్డు వచ్చినా మేము సహించం. నాదెండ్ల భాస్కరరావు ఎక్కడ మీటింగులు పెట్టినా మా గూండాలను పెట్టి కొట్టించలేదా, మా పోలీసులను పెట్టి మీటింగులను నిషేధించలేదా ? మాకు వ్యతిరేకంగా పోటీ చేసిన వెధవలను వికారాబాద్‌లోనూ, నల్లగొండలోనూ కొట్టించి కేసులు పెట్టించలేదా ? మాకు వోట్లు వేయని హరిజనుల ఇళ్ళ మీద దాడిచేసి - చిత్తూరు నుండి గుంటూరుదాకా - ఇళ్ల తగల బెట్ట లేదా ? దొంగతనాలూ దొమ్మీలూ చేస్తూ తెలుగు తల్లికి కళంకం తెస్తూన్న చీడపురుగులను లాకప్పులలో కొట్టి చంపించడం లేదా ? అందుకు కావలసిన రక్షణ పోలీసులకు ఇవ్వడం లేదా ? తెలుగు జాతి ఉన్నతి కోసం పాటుపడుతున్న మమ్మల్ని నిష్కారణంగా చీదర పెడుతూ జాతిపురోగమనాన్ని ఒక్కక్షణమయినా సరే ఆటంకపరిచే వాళ్ళను క్షమించడం జాతి ద్రోహం కాదా ?

ఇవన్నీ పాపం హోం మంత్రిగారు మనసులో అనుకొని వుంటారు. పైకి అనడానికి ఇంకా కొన్ని ఈ వెధవ ప్రజాస్వామ్యపు హక్కులూ విలువలూ అడ్డున్నాయి గదా. ఈ పేపర్ల వాళ్లు చెప్పిన విషయాన్ని సహృదయంగా అర్థంచేసుకోక పెద్ద పెద్ద అక్షరాలతో రాస్తారు. వాళ్ళను ఏమీ అనడానికి లేదు. ఏమయినా అంతే

దేశమంతా గోలపెడుతుంది. ప్రెస్ కౌన్సిల్ సంజాయిషీ అడుగుతుంది. కోర్టులు స్టే ఆర్డర్లు జారీ చేస్తాయి. ఏదో గాడిదగూడ మనలాంటి జంతువేగదా అని వీళ్ళను గాడిదకొడుకులంటే ఆ మధ్య ఎంత గొడవ జరిగింది. తెలుగు జాతి ఉన్నతిని సాధించడానికి ఇన్ని అవరోధాలా — !

మీరు ఇవ్వాళ మనరాష్ట్రాన్ని పరిపాలిస్తున్న వాళ్ళ మనసుల్లోకి చూస్తే ఈ ఆలోచనలే కనిపిస్తాయి. పరిపాలిస్తున్న వాళ్ళ అంటే ఎన్టీ ఆర్, వసంతనాగేశ్వరరావులు మాత్రమే కాదు - ఆ స్థాయినుండి క్రిందిస్థాయి పోలీసు తదితర అధికార్ల దాకా అందరిలోనూ ఇవే ఆలోచనలు. మనదేశ పాలకులు ప్రజాస్వామ్యాన్ని సహించగల దశను దాటి పోతున్నారు. తమ చేతులలో నియతృత్వ అధికారం ఎంత తొందరగా కేంద్రీకరించుకుందామా అని ఆతృత పడుతున్నారు. వాళ్ళలో వాళ్ళు ఆ అధికారాన్ని ఏ విధంగా పంచుకోవాలా అన్న విషయమయి అంగీకారానికి రాలేక పోతున్నారు గాని, లేకుంటే ఈపాటికి మనకున్న ఈ పాటి స్వేచ్ఛ గూడ లేకపోవును. కొత్త కొత్త వ్యాపారాలతో కొత్త పెట్టుబడులతో కొత్త వర్గాలు పుట్టుకొచ్చే కొద్దీ ఈ ఆతృత మరింత అధికమవుతోంది. ఆ కొత్త వర్గాలకు అధికారం వచ్చిన చోట అమలవు తోంది గూడ.

ఇప్పటికే వాళ్ళలో ఎన్ని మార్పులు వచ్చాయో చూడండి. సంక్షేమ రాజ్యాన్ని గురించి, సంస్కరణల గురించి మాట్లాడడం మానేసారు. ఎ.ఐ.సి.సి (ఐ) లో పాత వాసనలు మిగిలిపోయిన ముసలి కాంగ్రెస్ నాయకులు గొడవచేయబట్టి రాజీవ్ గాంధీ కొంచెం తడబాటుతో సర్దుకున్నాడు గాని లేకపోతే సోషలిజం అవసరంలేదని ప్రకటించేవాడే. భూసంస్కరణలు, కనీసవేతనాలు మొదలయిన సంక్షేమ రాజ్యపు ఆచ్ఛాదనలు కాలంచెల్లి పోయాయి. 'అభివృద్ధి' పేరిట ఆస్తిపరులకు మరింత ఆస్తి సంపాదించుకునే రాయితీలను ఇచ్చే ఆర్థిక విధానం ఇప్పుడు నగ్నంగా రాజ్యం చేస్తోంది.

ఆచ్ఛాదనలు లేని వర్గ పరిపాలనకు పోలీసుల అండ చాలా అవసరం. అహం కార పాలనకు గూడ పోలీసుల ప్రయోగం అవసరం. అన్ని రకాలగా ఇవ్వాళ పోలీసుపాలన మన పాలకులకు అనివార్యమయింది. పోలీసులకు 'ఫ్రీ హాండ్' ఇచ్చి అత్యాచారాలు చేసిన వాళ్ళకు పారితోషికాలూ ప్రమోషన్లు ఇవ్వడం ప్రధాన పాలనా మార్గం అవుతోంది. మన రాష్ట్రంలో 'ఎన్‌కౌంటర్లు' చేసిన పోలీసు ఆఫీసర్లకు

శవానికి 30 వేల రూపాయల చొప్పున ఇస్తున్నారని వినికిడి. అటువంటి బేరమేదో లేకపోతే నక్సలైట్ పార్టీల ముఖ్యులనేకాక దొరికిన వాళ్ళందరినీ పోలీసులు చంపుతారా ?

'కొండాపూర్ కాల్పుల'గా ప్రఖ్యాతి గాంచిన వెంకట్రావుపేట కాల్పులనే తీసుకోండి. చనిపోయినఅయిదుగురిలో ప్రభుత్వం దృష్టిలోనయినా 'చంపదగ్గవారు' ఎందరు? ముగ్గురిమీద మాత్రమే చెప్పుకోదగ్గ కేసులున్నాయని పోలీసులంటున్నారు. అవయినా ఎంతవరకు నిజమయిన కేసులో ఎంతవరకు బనాయించిన కేసులో తెలీదు. మిగిలిన ఇద్దరిమీద ఎటువంటి కేసులూ ఉండే అవకాశంలేదు. వాళ్ల వెంకట్రావుపేట గ్రామ వాస్తవ్యులయిన తాడు రాజయ్య, వుప్పల లక్ష్మీరాజం. ఈ యువకులిద్దరూ గత మూడేళ్ళగా గ్రామంలోనే లేరు. 'మస్కట్' పోయే కోరికతో అప్పుచేసి బొంబాయిలో బ్రోకర్ల చుట్టూ తిరుగుతున్నారు. 100 కు 50 రూపాయలవడ్డీకి రాజయ్య 25 వేం రూపాయలు, లక్ష్మీరాజం 12 వేల రూపాయలు అప్పుచేసి బొంబాయి వెళ్లారు. రాజయ్యది రెండున్నర ఎకరాల భూమిగల కుటుంబము, లక్ష్మీరాజంది ఎకరంన్నర పాలికిచేసే కుటుంబం. ఇటువంటి పేదవాళ్లు ఆ పేదరికాన్ని తప్పించుకోవడానికి వేలకువేలు చట్టవ్యతిరేకమయిన వడ్డీకి అప్పుతెచ్చి బొంబాయిలో బ్రోకర్ల ఒడిలో ధార పోస్తూంటే తెలుగుజాతి ఉన్నతికి చీమకుట్టినట్టులేదు. తెలుగుజాతి రోడ్డు రవాణాసంస్థ వారు జగిత్యాల నుండి బొంబాయికి డెయిలీ సెమీలగ్జరీ బస్సు సర్వీసు వేసి ఈ దౌర్భాగ్యుల ఆశలను సొమ్ముచేసుకుంటున్నారు. కాని ఈ గ్రామాలవాళ్లు సి.పి.ఐ.(ఎం-ఎల్) అభ్యర్థికి వోటువేస్తేమాత్రం అది ద్రోహం అయింది. ఎన్నికలముందూ ఎన్నికల తరువాతా ఈ గ్రామాలమీద దాడులు జరిపి ఇళ్లూ ఒళ్లూ గుల్లచేశారు. సముద్రలింగాపురంలో సత్యమ్మ అనేస్త్రీ మీద అత్యాచారం చేసారు.

ఇప్పుడు రాజయ్యనూ లక్ష్మీరాజంనూ మరొక ముగ్గురు కార్యకర్తలనూ చంపారు. మూడేళ్ళ తరువాత మొట్టమొదటిసారిగా ఈ యిద్దరూ గ్రామానికి వచ్చారు. మస్కట్ సంగతి దేవుడెరుగుగాని పంట కోతలకు సహాయం చేయడానికి రమ్మని తల్లిదండ్రులు రాస్తే వచ్చారు. రాజయ్య తన మరణానికి నెలరోజులక్రితం వచ్చాడు. లక్ష్మీరాజ్యం కేవలం నాలుగు రోజులక్రితం వచ్చాడు. ఏప్రిల్ 10 రాత్రి ఇద్దరూ పొలం కాపలాకని వెళ్లారు. అక్కడ పార్టీ కార్యకర్తలు కనబడడంతో వాళ్ళతో మాట్లాడి, కొండాపూర్ శివార్లను ఆనుకొనివున్న బయలు ప్రాంతంలో పడుకున్నారు.

ఆరాత్రి జరిగిన హత్యాకాండనుండి తెలివిగా తప్పించుకున్న ఒకవ్యక్తి ఆ తరువాత పత్రికా విలేఖరులకు చెప్పిన కథనం ప్రకారం, వాళ్లు నిద్రపోతుండగా పోలీసులు వచ్చి, తుపాకులతో ఛాతిమీద కొట్టి లేపి, చేతులు వెనక్కి కట్టి, ఏంచేయాలా అని కొంత సేపు తర్జన భర్జనలు జరిపి, తరువాత కాల్చి చంపారు. లక్ష్మీరాజం తుపాకీదెబ్బలు తిని పారిపోయే ప్రయత్నం చేయగా వెంబడించి చంపారంట. ఈ కథనాన్ని ప్రచురించిన దిన పత్రికల సంపాదకులకు కరీంనగర్ పోలీసులు సమ్మన్స్ ఇచ్చేదాకా వెళ్ళ గలిగా రంటే తమ అకృత్యాలు బయట పడితే వాళ్ళకు ఎంత ఉక్రోశమో అర్థమవుతుంది.

నిజానికి ఈ కథనం బయటకు రాబట్టి ప్రజలలో ఈ బూటకపు ఎదురుకాల్పుల పట్ల చాలా ఏవగింపు కలిగింది. అన్నీ ఇంత 'డ్రెమటిక్'గా బయటకు రాలేదుగాని, దాదాపు అన్ని ఎన్ కౌంటర్ల కథలూ ఇంతే. మార్చి 28న ఖమ్మం జిల్లా వీరభద్రారంలో అర్సపల్లి వెంకటేశ్వరరావు (చంద్రన్న)ను చంపారు. ఈ గ్రామం భద్రాచలంనుండి ఉత్తరానికి 20 కిలో మీటర్ల దూరంలో—వెంకటాపురం వెళ్లే రోడ్డుకు తూర్పున—వుంది. గిరిజనేతరులు భూములు కలిగి వుండటానికి వీలులేని ఈ 'నోటిఫైడ్' ప్రాంతంలో మంచి మంచి పొగాకు తోటలూ భద్రాచలంలోని మిద్దెలూ (దేవుడి గుడి గూడ) గిరిజనేతరులవే. ఈ భూ ఆక్రమణను కొద్దికొద్దిగా చట్టబద్ధం చేసే ప్రయత్నం చెన్నా రెడ్డి కాలం నుండి అన్నగారి కాలందాకా (పార్టీ, ప్రాంతం, కులం, తేడాలు లేకుండా) సాగుతోంది. ఆ భూ ఆక్రమణగాని ఈ ప్రయత్నంగాని జాతికి ద్రోహంగా ఎవరికీ తోచినట్టు లేదుగాని, గిరిజనులను సంఘటిత పరచి సారాధర తగ్గించి సారా కాంట్రాక్టర్ల కడుపుకొట్టిన చంద్రన్న మాత్రం తెలుగుజాతి ఉన్నతికి అవరోధంగా కన బడ్డాడు.

ఆ ప్రాంతపు సారాకాంట్రాక్టర్ అయిన పాండేతో మాట్లాడటానికి చంద్రన్న అతన్ని మార్చి 28 నాడు వీరభద్రారంలోని మట్టాలక్ష్మయ్య ఇంటికి రమ్మని కబురు చేశాడు. తాను మధ్యాహ్నం అయేసరికి అక్కడికి చేరుకున్నాడు. కాంట్రాక్టరు వచ్చేదీ లేనిదీ తెలుసుకొని రమ్మని అతనిగుమాస్తా యింటికి లక్ష్మయ్యను పంపగా 'వస్తాడు ఉండమని' చెప్పి పంపించారు. కాని వచ్చింది కాంట్రాక్టరుకాదు, భద్రాచలంసర్కిల్ ఇన్స్పెక్టర్ నాయకత్వంలోని పోలీసులు. లక్ష్మయ్య 'ఇల్లు' అనిపిలవబడేది రెండు తలుపులు గోడలులేనిపాకల సముదాయం. పోలీసులువచ్చేసరికి చంద్రన్న చిన్నపాకలో విశ్రమిస్తున్నాడు. అతనికి మూడునాలుగు రోజులుగా ఒంట్లోబాగులేదని, అనాల్జిన్

బిళ్లలు వేసుకుంటూండగా చూసామని, పరిసరగ్రామాల ప్రజలు అంటారు. పోలీసు
లను చూసి చంద్రన్న లేచి పరుగెత్తాడు. వాళ్లవెంటబడి కాల్చారు. ఆ దెబ్బలు తగల
లేదుగాని, ఎదురుగా వచ్చిన మరికొందరు పోలీసులు సూటిగాకాల్చి చంపారు. ఛాతీలో
ఒకటి, నుదుటిమీదఒకటి, రెండుదెబ్బలు మాత్రమే ఉన్నాయి.

కాలక్రమంలో ముందుకుపోతే ఈ సంవత్సరపు మొట్టమొదటి ఎన్‌కౌంటర్
జనవరి 21నాడు జగిత్యాలతాలూకా పెంబట్లగ్రామ పంచాయితీలోని పోచంపల్లి లో జరి
గింది. హతుడు కైరి గంగారాం. జగిత్యాల తాలూకాలో పోలీసులతోబాటు స్థానికభూస్వా
ముల ప్రైవేట్ గూండాలయిన అఖిలభారతీయ విద్యార్థిపరిషత్ కార్యకర్తల స్వైర
విహారంవల్ల పౌరహక్కుల సంస్థలేకాదు, పత్రికావిలేఖరులు సహితం విషయ సేకరణ
కోసం పోవడానికి సాహసించరు. కాబట్టి గంగారాం'ఎన్‌కౌంటర్'విషయంలో నిజంగా
ఏంజరిగిందో సంపూర్ణంగా ఎవరికీ తెలియదు. ఏదికాకున్నా ఇదొక్కటిమాత్రం నిజ
మయిన ఎన్‌కౌంటర్ అనీ, కావాలంటే వూళ్లో ఎవరినయినా అడగండనీ కరీంనగర్
జిల్లా పోలీసు అధికార్లు ఛాలెంజి చేస్తున్నారు. అయితే వాస్తవాలు తెలిసినంత మేరకు
అనుమానాస్పదంగానే వున్నాయి. ఆరోజు ఉదయం గంగారాం మరిముగ్గురు వ్యక్తు
లతో ఆ గ్రామానికివచ్చి ఒక ఇంట్లోఉన్నాడట. ఈ విషయంతెలిసి పోలీసులు (జగి
త్యాల ఎస్.ఐ. నాయకత్వంలో) వస్తున్నారని విని ఆముగ్గురూ వెళ్ళిపోయారట. వెళ్ళి
పోయే అవకాశంలేక గంగారాం తలుపులు బిగించుకొని ఇంట్లోనే వున్నాడట.
పోలీసులువచ్చి అతన్ని తలుపులు తీయమనీ, ఎటువంటిహానీ జరగదనీ పిల్చారట.
అతను వాళ్ళమాటలు నమ్మక తలుపులు తీయలేదు. అప్పుడు ఒకపోలీసు అధికారి
ఇంటికప్పు మీదికి ఎక్కి, కప్పుకొంత తొలగించి, లోపలికి రివాల్వర్ గురిపెట్టికాల్చి
చంపాడట. గంగారాం కప్పుమీదికి 'ఎదురుకాల్పులు' జరిపాడో లేదో తెలీదు.

మే నెలలో ఒక్క వరసలో మరి మూడు ఎన్‌కౌంటర్లు జరిగాయి. పత్రి
కలలో వచ్చిన రిపోర్టులను బట్టి చూస్తే ఎంత సునాయాసంగా యథేచ్ఛగా చంపు
తున్నారో అర్థమవుతోంది. నిజామాబాద్ జిల్లా బస్వాపూర్ గ్రామంలో మే 1 నాడు
బావి దగ్గర స్నానం చేస్తున్న వాళ్ళ మీదికి పోలీసులు రావడంరావడమే కాల్పులు
జరిపారు. ఇద్దరు చనిపోగా మిగిలిన వాళ్ళు ఆత్మరక్షణ కోసం పోలీసుల వైపు
కాల్పులు జరిపి పారిపోయారు. లేకపోతే వాళ్ళుగూడా చనిపోయేవారే. ఒక కానిస్టే
బుల్‌కు గాయం అయింది. కరీంనగర్ జిల్లా బొమ్మిరెడ్డిపల్లిలో మే 6 నాడు అంతకంటే

దారుణమయిన హత్య జరిగింది. ఒక ఇంట్లో మాట్లాడుతున్న కార్యకర్తను పట్టు కోవడం కోసం వచ్చి అతనితోపాటు ఆ యింటి యజమానినిగూడా పట్టుకొని ఇద్దరినీ ఇంటి నుండి తీసుకుపోయి కాల్చిచంపారు. మే 14నాడు ఆదిలాబాద్ జిల్లా లోడ్‌పల్లిలో ఇంకొక ఎన్‌కౌంటర్ జరిగింది. చనిపోయింది ఇద్దరని మొదట ప్రకటించి, తరువాత ముగ్గురని, కాదు ఇద్దరేననీ అన్నారు. వాస్తవంగా ఒకేచోట ఒకే రోజు రెండు 'ఎన్‌కౌంటర్లు' జరిపారని, మొదటిసారి ఇద్దరినీ ఆ తరువాత ఒక్కరినీ చంపారని తెలుస్తోంది.

ఇప్పటి దాకా (అంటే ఈ రిపోర్టు రాసేదాకా) 14 మంది ఈ సంవత్సరం ఎన్‌కౌంటర్లలో చనిపోయారు. పోలీసుల వైపున ఎవ్వరికీ ప్రాణం పోలేదు. బస్వాపూర్‌లో గాయపడ్డ కానిస్టేబుల్ ఒక్కడికే నిజంగా గాయం అయింది. మిగిలినవి అన్నీ బూటకపు ప్రకటనలే. అన్ని సంఘటనలలోనూ సాక్షులను బెదిరించడం, అరెస్టు చేసి దాచిపెట్టడంచేస్తున్నారు. వీరభద్రారంలో చంద్రన్నను చంపిన తరువాత భద్రాచలం డి.ఎస్.పి. ఆ ప్రాంతపు గ్రామాలపై స్వయంగా దాడిచేసి కొన్ని రోజుల పాటు జనాన్ని కొట్టడం, బెదిరించడం సాగించాడు. వెంకట్రావుపేట సంఘటనకు ప్రత్యక్ష సాక్షి అయిన నాలికరాములును ఆ రాత్రి నుండి మెజిస్టీరియల్ విచారణ జరిగేనాటిదాకా దాచి వుంచారు.

ఈ 14 ఎన్‌కౌంటర్ హత్యలుకాక విప్లవోద్యమానికి సంబంధించిన మరొక 5మందిని, నిజామాబాద్ (భూక్యాకిషన్, అమరనాథరెడ్డి), వరంగల్ (సుదర్శన్, సారంగపాణి), ఆదిలాబాద్ (సామెర్ల నాని) జిల్లాలలో 1984-85 సంవత్సరాలలో పోలీసుకస్టడీలో చంపారు. 1983లో ముగ్గురిని ఎదురు కాల్పులలో చంపారు.

ఈ లెక్కలను బట్టి చూస్తే మరొకవెంగళరావుగా చరిత్రలో నిలిచిపోవాలన్న కోరిక మన ముఖ్యమంత్రికో హోంమంత్రికో కలిగినట్టు తోస్తోంది. కాని ఒక్క విషయం మాత్రం వాళ్ళిద్దరూ గుర్తుంచుకుంటేమంచిది. 400మందిని చంపినవెంగళరావు నక్సలైట్ ఉద్యమాన్ని ఆపలేకపోయాడు. అది మరింత బలం పుంజుకుంది. ప్రజలకు సమస్యలున్నంతకాలం, ఆ సమస్యలవల్లలాభపడేవారు దేశపాలక వర్గంగా ఉన్నంత కాలం ఆ వర్గానికి ప్రాతినిధ్యం వహించే వెంగళరావులూ, రామారావులు, నాగేశ్వర రావులూ తుపాకులతో సామాజిక శాంతిని స్థాపించాలనుకోవడం కల్ల.

# నదీమతల్లీ ఇంద్రావతీ !

యువక

నదీమతల్లీ ఇంద్రావతీ స్తంభించిపోయావు ఎందుకని
గలగల చిరునవ్వులేమాయె చెలి బస్తర్ కన్నుల్లో నీరేలనే॥
దండకారణ్యాన్ని పండించిన శివన్న బాలన్న పోరన్నలు
మనకింక లేరాని నా చిన్నా స్తంభించిపోతారా ఎవరన్నా
చెలితోన చెప్పి ఓదార్చవె వీరులు చావరు నిజమమ్మా
నీ చిట్టితమ్ముడు శివన్న ఆదివాసులగన్న మాయన్న
అడవి జనులలోనె మాయన్న తలిపంద్రులను జూసె ఓయమ్మ
పేద బతుకులకోసం మాయన్న మాడియ భాష నేర్చినాడమ్మ
బైలదిల్ల ప్రాంతమంతటిలో పోరాట మంటల్ని రాజేసెనే
మధ్యప్రదేశం పోలీసులు నరరూప ఖాకీ రాక్షసులు
పోరు నార్పాలని శివన్నను కాల్చిచంపినారె నీ కన్నను
శివన్న పోరుబాటలలో జనులు సాయుధులవుతున్నారమ్మా
గిరిజన కూలీ పోరులలో శివన్న బతికే ఉంటాడులే
జగిత్యాల బిడ్డ ఎర్రన్న ఉప్పుమడిగె పోరుబాలన్న
దొరతొ పందెమేసె ధర్మన్న భూస్వామ్య గుండెల్లో బాకమ్మ
ఈ పోరు లీ పేరు లెవ్వరివె నీ ముద్దు లన్నయ్య గణపతివె
సిరిపంచ సింహము శంకరన్న అన్నవారసుడు బాలన్న
ఆంధ్ర మహారాష్ట్ర మధ్యప్రదేశ్ హద్దుల్ని చెరిపేసినాడమ్మ
ద్రోహి కుట్రచేత ఓయమ్మా కాల్చి చంపినారె బాలన్నను
అన్నింక లేడాని ఓయమ్మా కలత చెందకే మాయమ్మా
ఎర్ర సేన విజయ కవాతుల్లో అన్నగుండె మళ్ళీ ఆడునులే
స్పందించవే ఓ ఇంద్రావతీ రగిలించవే చెలిబస్తరును
నీలోన తడిసిన నెత్తుటిని నెత్తుటి ఆశల బాసలను
ఆశయాల ఎర్రబావుటాను అందించవె పోరుకూలన్నలకు
ఉప్పొంగవే ఓ ఇంద్రావతీ ముంచెత్తవే ఢిల్లీ గుండెలను
ఉప్పొంగవే ఓ ఇంద్రావతీ

# అరణ్యంలో హిరణ్య గర్జన

ఏలేర్

అరణ్యమున హరీంద్ర గర్జన
వినలేదా నువ్వింకా ?
నువ్వింకా వినలేదా ?
మీరింకా వినలేదా ?
అధికార్లంతా హడల్ చెందుట
దళారీలు దడదడ లాడుట
కామందులు కంగారెత్తుట
కాకీగుడ్డలు కలవర పడుట
కొండన్నలు కోలాటమాడుట
ఎల్లవరం ఎర్రెర్రగవుట
వినలేదా వినలేదా ?
వినకుంటే వాస్తవమిది వినండి
ఇన్నాళ్ళటి ఏజెన్సీ
కాదు కాదిది నేడు
ఇన్నాళ్ళటి ఏజెన్సీకాదు
ఇన్నాళ్ళటి కొండోళ్ళుకారు
అడవుల్లో అన్నల ప్రవేశానంతరం
వికసించిన వెన్నెల వెలుగులో
అన్నల మార్గంలో
పయనిస్తున్న కొండన్నలు
సాంప్రదాయక అలుగుల్ని
సాన పడుతున్నారు
కత్తి కొడవళ్ళను
తిరగేస్తున్నారు
అడవి ఎవడిదని

అధికారి ఎవడని
ఆక్రోశంతో గర్జిస్తున్నారు
ఉక్రోషం ఉగ్రరూపం
సౌమ్యం మార్దవం
శాంతానికి శాంతం
దౌర్జన్యానికి దండనం
నేడిక్కడ సాధారణం
ఇక్కడ అధికారం
అన్నల్ని అరెస్టు చేస్తే
పోరాట ప్రజానీకం
ఆర్డీవోల్ని అరెస్టు చేస్తుంది
ఇక్కడ
పోలీసు తుపాకులకు
ప్రజా చైతన్యం
సమాధానం చెపుతుంది
ఇక్కడి తూర్పు కనుమలు
తూర్పు వెలుగునే కోరుకుంటాయి
ఇక్కడి రాయీ రప్పా
కొండా కోనా చెట్టూ పుట్టా
కత్తీ గొడ్డలీ పలుగూ పారా
రామరాజు జ్ఞాపకాల్ని
నెమరు వేసుకుంటూ
అన్నల మార్గంలో నడుస్తూ
ఉద్యమానికి ఊపిరి పోస్తుంటాయి
ఉద్యమాన్ని చూసి
ఉక్కిరి బిక్కిరవుతుంది పోలీసుశాఖ
గందరగోళంతో
గాభరా పడతాడు వాడు

ఖంగరిని క్యాంపుపెడతాడు
క్యాంపుల్ని కల్లోలపరుస్తూ
అరెస్టుల్ని అవహేళన చేస్తూ
సీలేరు ఏలేరు
ఎర్రకోటకు పునాదులేస్తున్నాయ్
చింతపల్లి
చంద్రనిప్పులు చెరుగుతోంది
తాండవ
శత్రువు గుండెల్లో
ప్రళయ తాండవమాడుతోంది
కోరుకొండ దారకొండ
శత్రువు గుండెల్లో
గండి కొడుతున్నాయ్
శబరి
శర పరంపరల్ని విసురుతోంది
మహారణ్యంలో
మావో ఆలోచనా విధానం
మంటల్ని సృష్టిస్తోంది
బంధాల్ని ఛేదిస్తూ
దండకారణ్య మంతటా
పోరాట దండోరా
దణ దణ మోగుతోంది.

## మౌనమూ ఆయుధమే

ఉదయ మిత్ర

ఔను
మౌనమూ ఆయుధమే
పంటికింద నొక్కిపెట్టిన

ప్రతి రహస్యమూ
ఒక జీవితమే
అవులే అనుకుంటాం గాని
మౌనంలో బాకుల్ని దాల్చగలరు వీళ్ళ
కళ్ళల్లో భయం కదలాడినా
శరీరంపై అమానుష చిత్రహింసలెన్ని తాండవమాడినా
ఆత్మబంధువుల హాహాకారాలు గింగుర్లెత్తినా
చెదరని కొండ లాంటి గుండె
ఉత్తుంగ హిమాలయ శిఖరమో!?
రాయని మహాకావ్యమో!?

[ఇంద్రవెల్లి సభల కరపత్రాలు పంచుతుండగా మందమర్రి ప్రాంతంలో 12 ఏళ్ళ కుర్రవాడు పట్టుబడ్డాడు. పోలీసులెన్ని చిత్రహింసలు పెట్టినా ఒక్క రహస్యమూ బైటపెట్టని ఆ పిల్లవాడి ఉదంతం విన్నాక....]

## అనివార్యమ్

'సూర్యానువర్తి'

కమ్మని (!?) కలలు కంటున్నప్పుడయినా తప్పడంలేదు
ఖాకీ బూట్ల కర్కశ ధ్వనులు
డేగలై గుండెలమీద వాలుతున్నాయి
నిర్దయగా కలల్ని ముక్కున కరుచుకు పోతున్నాయి
స్వప్నం దుస్వప్నమవుతోంది
కలలు కమిలి నల్లని 'ఖాకు' లౌతున్నాయి
చదువుతున్నది చరిత్రయినా తప్పడంలేదు
చరిత్ర పొడువునా పునాదిబతుకుల అనాధగాధలు వినిపిస్తాయి
కాళ్ళకింద ఎండిన ఎముకలు విరుగుతున్నా సవ్వడి వినిపిస్తుంది
కాళ్ళు కదలవ్
కన్నీ రాగదు.
వేదికల మీద ఉపన్యసిస్తున్నా అంతే

'కల్లోలిత ప్రాంతాల' నుంచి పొలికేకలు వినపడతయ్
కాల్పులు వినపడతయ్
నా మాటల్లో చొరబడతయ్
ఉపన్యాసమంతా ఉద్యమ పాఠంగా మారుతుంది
అమరవీరుల ఆఖరి ఊపిరులు
ఊపిరిసలపనివ్వవు
కలల్ని కలంలోకి తీర్చి కవిత్వంరాస్తున్నా తప్పదు
అంతటా ఆకలి రాకాసిలా విహరిస్తున్నట్టు
రాకాసులు ఆకలిగొన్నట్టూ
ప్రజలను విరుచుకు తిన్నటూ
దేశం వెన్నెముకమీద
బాలెట్ రాచపుండు విచ్చుకున్నట్టూ
గుడిసెలు కాలుతున్నట్టూ
మంటలు మాట్లాడుతున్నట్టూ
కన్నీరు కాల్వలై నట్టూ
కన్నీరు కళ్ళప్పినట్టూ కలంక త్తయినట్టూ
అక్షరాలు ర క్తసి క్తమయినట్టూ
కవిత ఆయుధమైనట్టూ
నేను
రెక్కవిప్పిన అశాంతిడేగనై నట్టూ....

## మనం పాడాల్సిన పాట

'చిన్న'

సాయంకాలాల్ని
మండు టెండల్లో మంచుమాసాల్ని
తద్వారా పొందే శీతల కోమల
భావోద్వేగాల్ని, మనో వాంఛల్ని
ప్రేమిస్తాం సరే —
అందమైన సాయంకాల్నొలిదిన వాళ్ళ
మనస్తాపాల మాటేమిటి ?
పువ్వుల్ని ప్రేమించినంత

సున్నితంగా సుకుమారంగా
శరీరాల్నీ బతుకుల్నీ
ప్రేమిస్తుంటాం సరే -
కర్కశ రాకాసి కోర
సజీవ హేలను కరకరా నమిలేస్తున్నప్పటి
మా చేమిటి ?
గొంతు విప్పిన ప్రతిమారూ
లలిత లలిత రాగాలూ ఆవేగాలూ
స్వప్నగానాలూ సంగమలూ
గంభీరమూ సుందరమూ అయిన
పదజాలాల్ని మాటాడతాం పాడతాం సరే -
ఊపిరాగి పొయ్యేదాక నొక్కబడ్తున్న స్వేచ్ఛా పిపాసుల
గొంతుల మా చేమిటి ?
అంతర్గత భావోద్వేగాలు
రసమయ జగత్తు
సుందర శిల్పం సున్నిత భావం
కవిత్వం - కలాల అదృష్టగీతికలు రాస్తాం సరే -
రాసినందుకే సంకెళ్లేసుకున్న
కలాల మా చేమిటి ?
విశ్వశాంతిని కబుర్లాడి
హక్కులు రాజ్యాంగాన్ని పొగడతాం
అచ్ఛమైన శాంతిని వాంఛిస్తాం సరే -
హక్కులు కాలరాయబడుతున్న వాళ్ళూ
హక్కుల్ని ఎక్కు పెడుతున్న వాళ్ళూ
అనుభవించే చిత్రహింసల మా చేమిటి ?
శిథిల వాంఛా శకలాల మధ్య
గవ్వలే ఏరుతున్నాం సరే -
తుపాకీ సన్నీ నీదాకా నాదాకా
రావటం మా చేమిటి ?

తప్పదు - ఇకనన్నా మనం మాట్లాడాలి
తప్పదు - ఆ ఆఖరు క్షణమైనా మనదిగా మిగలాలి
పెదవుల కదలికల మంటల నాదం
జ్వలన గీతాన్ని పాడాలి
తప్పదు - ఈ పాట సంక్లిష్టమే అయినా
మనం పాడాల్సిన పాటే.

[పేరు గుర్తులేని కవికీ, అతని శైలికీ కృతజ్ఞతలతో]

## సూది మీద సూపు పెట్టి

వి. సత్యం

అన్న బస్తన్న
ఓయన్న దర్జన్న
కుట్టుకూలి టేలరన్న ॥అన్న॥
పక్క పొర్లి సూశె వరకె
జెప్పన తెల్లారి పోయె
చెయిను లేని బ్యాగు తీసి
సద్దిడబ్బ సంకనేసి
బస్సు పైసలు బదలడిగి
బయలెల్లితివా పనికి ॥అన్న॥
పది గంటల రాత్రి దాక
పడ పడ పడ దడ దడ దడ
మిషను ఎక్కి తొక్కి తొక్కి
ఫాషన్లను పెంచినావు
సేట్ల బొర్ర బెంచినావు
కాళ్లు వాసి కండ్లుగుంజి
యూల్లాడుతు వస్తున్నవ ॥అన్న॥
సూదిమీద సూపుపెట్టి
సూతు సూతు కొల్సుకుంటు

కాలరులో కడకు కడకు
కాన్వాసు పట్టిజేసి
పాయింట్ పట్టి పీకి పీకి
పండ్లన్ని నొప్పాయె ॥అన్న॥
బట్ట బట్ట భద్రంగా
కట్ట కట్ట కత్రించి
ఏండ్ల కేండ్లు నడిసిపాయె
ఏమి దిక్కు లేదాయె
సూదు లెన్నో మొనపాయె
నడుమంతా గూనాయె ॥అన్న॥

వానకాల మొచ్చింది
పని సీజను సచ్చింది
ఒక్క నసుగు గతి లేదు
దిక్కు మొగం వేసినావు
హత్త అంత పనిలేదని
అడ్వాన్సే ఇవ్వగనె ॥అన్న॥

కష్టాలను మరిచేందుకు
వ్యసనాలు నేర్చితివి
తిరుగుబాటు నణిచేందుకు
తీపి మందదోరన్న
మోసపోకు ఇంక ముందు
మొక్కుకుంటె హక్కురాదు
కూలోల్లం ఏకమయ్యి
కొత్త లోకమె తెద్దాము ॥అన్న॥

కథనం

# కొత్తచదువు

సి. హెచ్. వేణు

దసరా సెలవులకు కాలేజీలు మూతబడినాయి. కాలేజీలు మూతబడడంతో హాస్టల్లు కూడా మూసేశారు.

సెలవుల్లో చేయాల్సిన కార్యక్రమాల గురించి హాయిగా ఊహించుకుంటూ, విద్యార్థులు హాస్టల్ ఖాళీచేసారు.

కాని హాస్టల్లో పండ్రెండుగురు విద్యార్థులు మాత్రం వెళ్ళకుండా వున్నారు.

వాళ్ళు పల్లెల్లో, పొలాలలో కష్టించి చెమటోడ్చి పంటలు పండించే రైతాంగం దగ్గరకెళ్ళి కొత్తచదువు చదువుకోవడానికి వెళ్ళాలనుకున్నారు. వాళ్ళు రాడికల్ విద్యార్థులు.

ఆ రాత్రి అందరూ కూర్చుని ఎక్కడికి వెళ్ళాలో చర్చించుకున్నారు. పండ్రెండు మంది మూడు దళాలుగా విడిపోయారు.

"కామ్రేడ్స్ మనం అనుకున్నట్లుగా మదనపల్లి తాలూకు, తంబళ్ళపల్లి తాలూకాకు క్యాంపెయిన్ వెళ్ళాలని నిర్ణయించిన వాళ్ళు తెల్లవారుజామున వెళ్ళిపోవడానికి రెడీగా వుండండి. మిగిలిన కామ్రేడ్స్‌ను తీసుకొనిపోవడానికి మనిషి వస్తాడు. కాబట్టి ఆయన వచ్చేంతవరకు వాళ్ళు కాచుకొని ఉండి, అతను ఎక్కడికి వెళ్ళాలని నిర్ణయిస్తే ఆ నిర్ణయాన్ని పాటించండి." అందరిలోకి పెద్దగా వున్న సీనియర్ విద్యార్థి సభ్యుడు దళాలుగా విభజించి కార్యక్రమం వివరించాడు.

రెండు దళాలు తెల్లవారుజామున్నే లేచి వాళ్ళు వెళ్ళవలసిన ప్రాంతాలకు వెళ్ళిపోయారు.

మూడవ దళాన్ని తీసుకొని పోవడానికి రావలసిన వ్యక్తి మరుసటి రోజు రాత్రికొచ్చాడు. పేరు 'రాజప్ప', యువకుడే. ఇరవై సంవత్సరాలకన్నా ఎక్కువ వయసుండదు. బాగా చురుకైన వాడు. చదువు వదలి పెట్టి విప్లవ రాజకీయాల్లో లీనమైనాడు.

వాళ్ళు వెళ్ళ వలసిన ఊరు 'రామిరెడ్డిగారి పల్లె'. ఆ ఊరు పుంగనూరు తాలూకాలో వుంది. పుంగనూరు నుండి చౌడేపల్లి మీదుగా ఆ వూరికి గవర్నమెంటు బస్సులు నడుస్తాయి. రైలు మార్గం వెళ్ళాలంటే ఉత్తరం పది మైళ్ళు వెడతే 'కలికిరి'

స్టేషనుంది. ఆవూరికి తాలూకా సెంటరు పుంగనూరే అయినా ఆవూర్లో వాళ్ళు ఎక్కు వగా అన్ని పనులకు 'కలికిరి'కి వెళ్తారు.

* * *

'రాజప్ప' ఆ రాత్రి అక్కడే పండుకొని, తెల్లవారు జామున విద్యార్థుల దళాన్ని తీసుకొని, పాసింజరు రైలుబండి కొచ్చి కలికిరి స్టేషన్లో దిగారు.

నడచుకుంటూ ఊరిని సమీపించేటప్పటికి పదిగంటలయింది.

దూరం నుంచి చూస్తే ఊరు కనిపించకుండా, చింత వనంలాగుంది. ఊరిలో ఎక్కడ చూసినా చింత చెట్లే. ఇండ్లల్లోను, ఇండ్ల ముందు వైపు, అన్ని చోట్లా చింత చెట్లే. ఆ చింత చెట్ల మధ్యన అందంగా కట్టుకున్న పెద్ద మిద్దె, పెంకులతో కప్పిన వసారా, వరండాలో సోఫాసెట్టు, వైరుతో అల్లిన ఫ్రేమ్ కుర్చీలు, ఈజీ చైర్ లు. ఇల్లు అందంగా వుంది. గొడ్ల నివాసానికి పెద్ద కొట్టాలున్నాయి. ట్రాక్టరుకు రేకులతో కట్టిన షెడ్డు. వనానికి ఊరికి రాజులాగావున్న భూస్వామి 'గురునాధరెడ్డి'ది ఆ భవనం.

ఆ భవనానికి ముందు కొద్ది దూరంలో మట్టి రోడ్డు, మట్టిరోడ్డుకు పైభాగాన భూస్వామి భవనానికి ఎదురు ముఖంగా కాపలా కాస్తున్నట్లు రెండు మాలపల్లెలు. ఒకొక్క పల్లెలో యాభై యిండ్లు లెక్కన రెండు పల్లెల్ని కలిపి నూరు పూరిండ్లు కొట్టాలుంటాయి. ఆ రెండు పల్లెల్ని కలిపి భూస్వామి గురునాధరెడ్డి వాళ్ళ తాత పేరుతో 'రామిరెడ్డిగారి పల్లె' అని 'రెడ్డేరి పల్లె' అని రెండు విధాలుగా ఆ వూరిని పిలుస్తారు.

రామిరెడ్డి పల్లెకు ఏకఛత్రాధిపతి గురునాధరెడ్డి. రెడ్డి పేరంటే ఊరుఊరంతా గడగడలాడతాది. అతని మాటకు ఎదురు లేదు. గురునాధ రెడ్డిని చూడనోళ్ళు అతన్ని గురించి వింటే, అతను గంభీరంగా ఉంటాడనుకుంటారు. అతన్ని చూసిన తరువాత అనుకున్న రూపం తారుమారౌతుంది.

గురునాధరెడ్డి బట్టతల కల్గి, కళ్ళజోడు పెట్టి, జోడు మనుషుల్లాగా పైకి ఒక రూపం, లోపల ఒక రూపం కల్గిన రాక్షసుడు. నలభయి సంవత్సరాలున్న గురు నాధరెడ్డి, మాలపల్లిలో డెబ్బై ఏండ్ల ముసలితాతనయినా 'ఒరేయి ముండాకొడుకా' అని పిలుస్తాడు. తన బిడ్డల్ని అందమైన పేర్లు పెట్టి నాజూకుగా పిలిచే నోరు, మాల పల్లి బిడ్డల్ని, చెల్లెళ్ళను ఈడొచ్చిన అక్కల్ని 'లంజల్లారా' అని తప్ప మరో విధంగా పిలవడు.

'రాజప్ప' విద్యార్థులకు భూస్వామి భవనాన్ని చూపించి, అతన్ని గురించి క్లుప్తంగా వివరించాడు.

అందరిని గంగులయ్య యింటికి పిల్చుకొని పోయాడు. ఆ సమయానికి గంగులయ్య భార్య నరసమ్మ యింటి దగ్గరే ఉంది.

"రాండన్నా లోపలికి రాండన్నా కూర్చుందురు" అంటూ నరసమ్మ అందరిని లోపలికి పిలిచి కూర్చోపడానికి ఈతచాపలు పరిసింది.

అందరికి తాగడానికి మంచినీళ్ళిచ్చి, వాళ్ళు తెచ్చిన సంచులు, పుస్తకాలు తీసుకెళ్ళి లోపల పెట్టింది.

"గంగులన్న ఎక్కడికెళ్ళినాడు, నరసమ్మక్కా" రాజప్ప

"పనికి పోయినాడన్నా. నాకు పానం బాగలేక నిల్సిపోయినానన్నా" నరసమ్మ వివరించింది.

గంగులన్న అంటె, రాజప్పకు చాలా గౌరవం. గంగులన్న మంచి కార్య కర్తగా మారగలడని రాజప్ప అంచనా. ఆ వూర్లో సంఘం పెట్టాలని పట్టుపట్టింది కూడా గంగులన్నే.

* * *

గంగప్ప అయిదువరకు చదువుకున్నాడు. ముప్పై సంవత్సరాలు వయస్సుంటుంది. ఇద్దరు ఆడపిల్లల తండ్రి. మాలపల్లిలో నలుగురిచేత మంచనిపించుకున్నాడు. ఏదైనా మంచి చెడ్డ అడగాలంటె, ముందునిలబడి ముఖాన్నే అడిగేస్తాడు.

దొంగచాటు వ్యవహారాలు చేసి, తగవులు పెట్టేవాళ్ళంటె అతనికి గిట్టదు. అందుకే అతనంటె యువకులు, పెద్దోళ్ళుకూడా గౌరవిస్తారు. అతని మాటంటె నలుగురూ వింటారు.

ఒకరోజు రాజప్ప పుంగనూరు నుండి కలికిరికి బస్సులో పోతావుంటె గంగులయ్య పరిచయమయ్యాడు.

మాటల సందర్భంలో భూస్వాముల ప్రస్తావన వచ్చి తంబళ్ళపాడు, వాయల్పాడు తాలూకాలలో రైతుకూలీ సంఘంచేసే పనుల గురించి, భూస్వాములకు వ్యతిరేకంగా తైతాంగం చేస్తున్న పోరాటాల గురించి రాజప్ప వివరించాడు. కలికిరిలో మీటింగు జరుగుతుంది. రమ్మని కరపత్రం యిచ్చాడు.

కలికిరిలో బస్సు దిగిన తరువాత గంగులయ్య రాజప్పను వదల్లేదు. ఇద్దరూ టీ తాగి, మరలా మాటలు పెట్టుకున్నారు.

"మా పక్కలకూడా రైతుకూలీసంగాలు పెట్టాలన్నా, మా వూరికి రాండన్నా, మా వూర్లోకూడా సంగం పెడ్తాం" అని చెప్పి, గంగులయ్య వాళ్ళ పల్లెల్లో గురునాధ రెడ్డి చేసే అన్యాయాల గురించి వివరించాడు.

ఇద్దరూ మాటల్లోపడి టైమ్ సంగతే మర్చిపోయారు. మధ్యాహ్నం అయి సూర్యుడు నెత్తిమీద కొచ్చాడు.

గంగులయ్యకు 'రాజప్ప'తో ఆ విధంగా పరిచయమై అప్పుడప్పుడు రామిరెడ్డి పల్లెకు రాను మొదలుపెట్టాడు. వచ్చినప్పుడల్లా రైతుకూలీ సంఘం గురించి, పోరాటాన్ని గురించి వివరిస్తూ వుండేవాడు. ఊర్లో ఇంకా నారాయుడు, చెంగప్ప నర్సయ్య లాంటి యువకులు, రంగయ్య, ఎల్లయ్య తాతలాంటి పెద్దోళ్ళకూడా పరిచయ మయ్యారు. అందరూకూడా సంఘం పెట్టుకోవడానికి బాగా ఆసక్తి చూపేవారు.

విద్యార్థులచేత పాటలు పాడి, ప్రచారం చేపించి సంఘం పెట్టాలనుకున్నాడు రాజప్ప. విద్యార్థులకు సెలవులు రావడంతో, అన్ని సమయాలు కలిసొచ్చి, అదేమంచి సమయం అనుకొని, విద్యార్థుల్ని పిల్చుకొనివచ్చాడు రాజప్ప.

* * *

మధ్యాహ్నం విద్యార్థులు ఒక్కొక్కరు ఒక్కొక్క యింటికెళ్ళి, వాళ్ళు పెట్టిన అన్నం తిన్న తర్వాత ఊరును సర్వే చేయడానికి కదిలారు.

చింతచెట్లకు కాయలు దండిగా యిరగ్గాసి ఉన్నాయి. ఊర్లో రెండు వందలకు పైగానే చింతచెట్లున్నాయి. మాలపల్లిలో ఇండ్లల్లో ఉండే చింతచెట్లకు కాసిన కాయలు కూడా భూస్వామికే చెందుతాయి.

ఒక్క కాయకూడా ఇంటిగల్ల వాళ్ల తగలకూడదు. రాలిన కాయలన్ని ఏరి, గురునాధరెడ్డి ఇంటిదగ్గర కుప్పపోయాల. ఎవరైనా చింతకాయలు తీసుకొని, తిని నారని తెలిస్తే తినిన పులుసు కక్కేదాకా, చెట్లకుకట్టి, కొట్టిస్తాడు.

మాలపల్లె నుండి, తూరుపుకొండకు దిగంతాల, కంటికి చూపు అనినంతవరకు గురునాధరెడ్డి భూమి, చెరువుకింద, కుంటకింద భూమంతా ఆయనపాలే. మాలపల్లిలో ఒకరికో యిద్దరికో ఎలిభూమి కొంత, చెరువుకింద కొంత కలిపి, ఒకెకరమో, అరెకరమో ఉన్నా, ఆ భూమి కూడా భూస్వామికి బాకీకింద, వడ్డీలకి, ఆయనవైపే వుంటుంది.

గురునాధరెడ్డికి ఆరు నూరెకరాల భూమున్నా, ఇంతభూమి చాలక, ఎక్కడ పరంబోకి భూమున్నా అవన్నీ ఆయన ఆక్రమణకిందే వుంటాయి. ఇక మిగిలిందల్లా కూలోళ్ళకు వాళ్ళ రెక్కలకష్టం మాత్రమే. పనికిపోతే రెండు మెతుకులు తినాల. లేకుంటె పస్తులుండాల. పొద్దు పొయ్యేదాకా పనిచేస్తే వాడిచ్చేది రెండు రూపాయలు మాత్రమే.

గురునాధరెడ్డికి ప్రతి సంవత్సరం ఆదాయం పెరుగుతున్నా కూలీలకిచ్చే కూలి మాత్రం రెండురూపాయలే. ఎక్కువ కూలి కావాలని ఎవడన్నా అడిగితె, వాడి బతుకు నాశనమయినట్లే. ఆ భయంతో ఎవ్వడుకూడా ఎక్కువడక్కుండా, 'ఆయ నిచ్చిన కాడికి ఈ నీలేరా' అని నోరెత్తకుండా తీసుకుంటారు.

* * *

పడమటివైపు కొండలల్లో వాలిపోతున్నట్టుగా సూర్యుడు అస్తమిస్తున్నాడు. చేలల్లో పనులు ముగించుకొని కూలీలు ఇండ్లదారి పట్టినారు.

విద్యార్థులు వాళ్ళ బాధలు పంచుకోవడానికి, ఎదురేగినట్లు వాళ్ళొచ్చే దారిలో రెండు పల్లెల మధ్యన ఎత్తుగావున్న బండ గుట్టమీదకు చేరారు. వాళ్ళ మనసులోని మాటల్ని, పాటలుగా పాడి వినిపిస్తున్నారు.

"బతుకులేమొ ఎండిపాయె మొండిమాను బతుకులాయె
రాజిగో ఈ రాజ్యమేలెటోళ్ల చావ .... .... ....
.... .... .... ....
రేపటిపూట తలుచుకుంటె గుండెలు ఝులు ఝల్లుమనె
రాజిగో ఈ రాజ్యమేలెటోళ్ల చావ"
అంటూ పాడుతున్నారు.

ఇండ్లకుపోయే కూలోల్లంతా బండమీద ఆగి పాటలు వింటున్నారు. దినదిన గండంగా ఈడ్చుకొస్తున్న బాధల్ని పాటలద్వారా వినిపిస్తావుంటె బాధలతో నలుగు తున్న కూలీల మనసుల్ని తడిమినట్లయింది. పాటలు పాడుతున్న విద్యార్థుల్ని వింతగా చూస్తూ ఆశ్చర్యపోతున్నారు.

"అమ్మల్లారా, అక్కల్లారా, అయ్యల్లారా ఈ రోజు రాత్రికి బండమీద రాడికల్స్ మీటింగు జరుపుతారు. పేదోల్ల కష్టాలమీద పాటలు పాడి వినిపిస్తారు. మన కష్టాలకు కారణాలు తెలిపి, దరిద్రంతో నలిగే మన బతుకులు ఘోరాలంటే

ఏమి చేయాలో వివరిస్తారో, కాబట్టి అన్నాలుతిన్నాక అందరూ బండ మీదకురావాలని కోరుతున్నాము"  పాటలు వినడానికి గుమికూడిన వారికి విద్యార్థి గట్టిగా చెప్పాడు.

ఇదివరకే పక్క తాలూకాలలో రాడికల్స్ చేస్తున్న కార్యకలాపాల గురించి వింటూ వచ్చిన కూలీలకు, ఆ రోజు వాళ్ళ వూరిని వెదుక్కుంటూ రావడంతో, సంఘమోల్ల గురించి తెలిసినకాడికి, ఒకరికొకరు చెప్పుకుంటూ, ప్రతియింట్లోను చర్చ ప్రారంభమైంది.

విద్యార్థులే గాకుండా, ఊర్లో యువకులతో కలసి గంగులయ్య యింటింటికీ వెళ్ళి "సంఘం గురించి వాళ్ళుచెప్పే విషయాలిని, మనం సంఘం పెట్టుకోవాల. కాబట్టి అందరూ బండమీదకు రాండి" అంటూ చెప్పుకుంటూ పోయారు.

ఊర్లో అందరూ కూడా ఉత్సాహంగా ఉన్నారు. ఊరికి కొత్తమార్పు వస్తున్నట్లు యువకులు సంబరపడుతున్నారు.

ఆకాశంలో నక్షత్రాలు మిలమిల మెరుస్తుంటె, చంద్రుని పాలనురుగు కాంతికి నల్లని మబ్బులు మాయమౌతున్నాయి. నీలాకాశం తేటంగా వుంది. రాడికల్ విద్యార్థులు పిండారబోసిన వెన్నెల్లో, బండమీద నిలబడి మౌనంగా వింటున్న మాలపల్లి ప్రజలతో తామెవరైంది, వెన్నెలే సాక్షిగా చూపుతూ, గొంతెత్తి పాడుతూ పాటలో చెపుతున్నారు.

"ఎవరీ పిల్లలమ్మ ఎన్నెలో – ఎన్నెలా
ఏ తల్లి బిడ్డలమ్మ ఎన్నెలో – ఎన్నెలా
ఏ యింటి వెలుగులమ్మ ఎన్నెలో – ఎన్నెలా
.... .... .... ....
.... .... .... ....
రాడికల్ పిల్లలమ్మ ఎన్నెలా ....

వాళ్ళు రణంచేసె బిడ్డలమ్మ ఎన్నెలా .... ...." అంటూ పాడుతున్నారు. పాట అయిపోయిన తర్వాత, విద్యార్థి దళనాయకుడు ఉపన్యాసం ప్రారంభించాడు.

"అమ్మల్లారా, —అయ్యల్లారా మీముందు నిలబడిన మేము, భూస్వాముల బిడ్డలం కాదు. మేం కష్టజీవుల బిడ్డలం, నక్సలైట్ బిడ్డలం. మేము చదువుకుంటున్న బడిపిల్లలం.

ఆడపిల్లలు పల్లెలు కొస్తున్నారంటే మీకందరికి వింతగా ఉండొచ్చు. ఎందు కంటె యింటినుండి పెద్దోళ్ళు పంపిస్తే, తిని బళ్ళల్లో హాయిగా చదువుకోనేటోళ్ళకు పల్లెల్ని పట్టించుకొనే పని ఏ ముంటుందని. లేకుంటె ఒకవేళ వాళ్ళొచ్చినా ఎలక్షన్లలో ఓట్లడగడానికి వచ్చిన వాళ్ళను చూసుంటారు. అయితే మేమొచ్చింది ఓట్లడగ టానికి కాదు. ఆ ఓట్లమీద మాకు నమ్మకంలేదు. మేమొచ్చింది, మనపేద బతుకులు, దరిద్రం బతుకులు మారాలంటే ఏం చేయాలో చెప్పడానికి వచ్చినాము. ఎందు కంటె మేముకూడా రైతాంగం బిడ్డలమే కాబట్టి. మీరు కష్టపడి పనిచేసిమమ్మల్ని చదివిస్తున్నారు. మామీద ఆశలు పెట్టుకుంటున్నారు. అయితె అవి నెరవేరడంలేదు. పెద్ద పెద్దచదువులు డాక్టరు కోర్సులు, ఇంజనీరింగ్ కోర్సులు అందరికి చదవడానికి వీలులేదు. అవి డబ్బు న్నోళ్ళకే పరిమితమైనాయి. మిగతావాళ్ళు కూడుపెట్టని చదువులుచదివి నిరుద్యోగులై పోయి, పిచ్చోళ్ళుగా తయారవుతున్నారు. కట్నం బాధలు పడలేక ఆడబిడ్డలు ఆత్మ హత్యలు చేసుకుంటున్నారు. విషంమింగి చస్తున్నారు. మాబతుకులట్లుంటె, పల్లెల్లో భూతల్లిని నమ్ముకున్న మీసంగతి చెప్పనక్కర్లేదు. పొలంలో దినమంతా పనిచేసి, బురదలో పొర్లాడి, చెమటను రక్తంగాపారించి, రతనాల పంటలు పండిస్తే, పండించే వాళ్ళు పస్తులుంటన్నారు. పనిచేయని భూస్వాములు మాత్రం, ఒళ్లు కదల్చకుండా చెమటోర్చకుండా నున్నగా కడుపులు పెంచుకుంటున్నారు. కష్టజీవుల కడుపులు కొట్టి వాళ్ళు కోటీశ్వరులవు తున్నారు. వాళ్ళే మంత్రులై, ప్రభుత్వమై రాజ్యమేలు తున్నారు. ఆ విధంగా ఎందుకయిందో కారణాలు తెలుసుకున్నాం. కష్టపడేవాడికి కూడెందుకు దక్కటం లేదో తెలుసుకున్నాం. మాకు కూడుపెట్టని చదువులు, దొంగలెక్కలురాసే చదువులొద్దని, కూడుపెట్టే చదువులు కావాలని, చదువుకొనే వాళ్ళనంతా ఒక్కటిగా చేసి విద్యార్థి సంఘాలుపెట్టి సమస్యల పరిష్కారం కోసం పోరాడుతున్నాం. సెలవు లల్లో రైతాంగం దగ్గర కొత్త చదువులు చదవాలని, మీ దగ్గరనుండి నేర్చుకొని ఈ బాధలు పోవాలంటె ఏం చేయాలో మాకుతెలిసింది మీకు చెప్పడాని కొచ్చినాము. పల్లెల్లోఉండే కూలీలు పేదరైతులు, కష్టపడే కార్మికులు, కులాలు మతాలపేరుతో విడి పోకుండా వాటినివదిలిపెట్టి అందరూ ఒక్కటిగా ఐక్యమై కూలి సంఘాలు పెట్టుకొని భూస్వాములుచేసే అన్యాయాలకు వ్యతిరేకంగా, దోపిడీ రాజ్యంతో పోరాడి, పేదోడి రాజ్యాన్ని దున్నె వానిదేభూమి కావాలని, ఊరు ఊరు, పల్లె, పల్లెకు తిరుగుతున్నాము, సంఘాలు పెట్టుకొమ్మని చెబుతున్నాం. ఆదిలాబాద్, కరీంనగర్, నిజామాబాద్

ఖమ్మం, వరంగల్ జిల్లాలలో రైతుకూలీ సంఘాలు పెట్టుకొని భూస్వాములతో పోరాడు తున్నారు. అన్యాయంగా పోగొట్టుకున్న భూముల్ని తిరిగి సంపాదించు కుంటున్నారు. బంజరుభూముల్ని ఆక్రమిస్తున్నారు. దోపిడిప్రభుత్వాన్ని కాపలాకాసే పోలీసులతోకూడా పోరాడు తున్నారు. వాళ్ళహక్కుల కోసం తెగించి పోరాడు తున్నారు."

విద్యార్థి దళనాయకుడు చెబుతూవుంటె, అందరుశ్రద్ధగా వింటున్నారు ఒకపెద్దాయన తనకుకల్గిన అనుమానాన్ని చెప్పడానికి లేచాడు.

"చూడు నాయనా నీవుచెప్పినేటియన్ని మంచి సంగతులే. ప్రపంచంలో జరిగే దంతా పూసగుచ్చినట్టు చెప్పినావు అదికాదసలా. అయితే నాకోకనుమాన ముందాని. పెద్దోణ్ని అడుగుతుండా కోపగిచ్చుకోకుండా చెప్పు. మనగవరమెంటు, ఎక్కడపడితే అక్కడ పేదోల్లకు, ఏమేమో చేసేత్తన్నామని, మైకుల్లో, రేడియాలల్లో చెప్తన్నారు కదా, మరినువ్వు చెప్పేసంగతులుగాని, అదేదో ఆదిలాబాదు, కరీమునగర్ అక్కడ సంగాలు పెట్టుకుని భూములు సంపాయిచ్చే సంగతి యాడగాని చెప్పలేదేమని? లేకుంటే సంగాలుండేది అక్కడోక చోటనేనా, ఇంకా మనప్రక్కల కూడా ఏమన్నా సంగాలుండాయా, ఆ సంగతులుకూడా చెబితే బాగుంటాది". ముసలోడు మంచిసంగ తులు అడిగినాడనుకున్నారు జనం.

ముసిలాయన పేరు 'ఎల్లయ్య' తనబతుకంతా భూస్వాములయింట్లో సేద్యగాడి గానే ఎల్లబారింది. ఒంటిలో రక్తమున్నంతవరకు పనిచేశాడు. రక్తముడిగి మోకాళ్ళ మోదుగ కట్టుకుపోవడంతో పనిచేయలేక పోయాడు. ఇప్పుడు మిగిలిన జీవనాధారం చేత్తో నులకతాడులు పేనుకొని బతకడమే.

విద్యార్థి ముసిలాయన్న అడిగినదానికి జవాబు చెప్పడానికి లేచాడు.

"ఆ తాత అడిగింది చాలా మంచి విషయాలడిగినాడు. ఎందుకంటె గవర్న మెంటువాళ్ళు ఎప్పుడుకూడా పేదోళ్ళకు ఏదేదో చేస్తున్నట్టు చెబుతూ ఆశచూపిస్తారు. ఏవయితే వాళ్ళుఅమలు పరచరో, వాటిని గురించి ఎక్కువగా చెబుతారు. ప్రజల్ని మభ్యపరుస్తారు. మాయచేస్తారు. వాటిని గురించి బాకాలూదడానికి ప్రభుత్వం చేతిలో సాధనాలు, రేడియోలు, టి.విలు, పత్రికలున్నాయి. వాటికిప్రభుత్వాన్ని పొగుడుతూ, అబద్ధాలు చెప్పేకార్యక్రమం తప్ప మరేంలేదు. కాబట్టి ప్రజా పోరాటాల గురించి రేడియోలుగాని, పత్రికలుగాని సరిగాచెప్పవు.

ఇక భూమికోసం జరుగుతున్న పోరాటాలందాము. అవి ఒక్క ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాలలోనేకాదు, రాష్ట్రమంతటా జరుగుతున్నాయి. మన చిత్తూరు జిల్లాలోకూడా రైతుకూలీ సంఘాలు పెట్టుకొని పోరాడుతున్నారు. రైతు కూలీలు కూలిరేట్లు పెంచు కుంటున్నారు. తంబళ్ళపల్లి, మదనపల్లి, వాయల్పాడు మొలకల చెరువు తాలూకాలలో భూస్వాములు చేస్తున్న అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. వడ్డీవ్యాపారస్తుల అక్రమాలను, చౌకదుకాణాల డీలర్ల అక్రమాలను నిలదీసి అడుగుతున్నారు. బంజరు భూములు ఆక్రమించు కుంటున్నారు. మన సమస్యల పరిష్కారానికి పోరాటమే మార్గమని తెలుసు కొంటున్నారు. కాబట్టి మీపైపుకూడా, మీకున్న సమస్యలు పరిష్కరించు కోవాలంటె, సంఘాలు పెట్టుకోని, పోరాటబాటలో వాళ్ళతో, కలవాలని కోరుతున్నాము". విద్యార్థి తనమాటల్లో చెప్పవలసినదంతా చెప్పి కూర్చున్నాడు.

తర్వాత గంగులయ్య మాట్లాడడం ప్రారంభించాడు.

"వయస్సులో మనకన్నా ఎంతో చిన్నోళ్లయినా మనబతుకుల గురించి, తెలీని సంగతులెన్నో చెప్పినారు. తంబళ్లపల్లి, మదనపల్లి, వాయల్పాడు తాలూకాలలో పోరాటాల గురించి, మనచెవిన అప్పుడప్పుడు పడతూనే ఉన్నాయి. ఈ పొద్దు వాటి గురించి యింకా బాగా వివరంగా తెలుసుకున్నాం. అయితె మనంకూడా వాళ్లమాదిరి గానే సంగం పెట్టుకోవాలను కుంటానే ఉంటాము. అదట్నే జరిగి పోతాంది. ఇపుడు మన బడిపిల్లోల్లు సంగంగురించి ఎన్నోసంగతులు చెప్పి మన అనుమానాలన్ని పోగొట్టి నారు. ఎట్టాగు ఈ పొద్దు అందరం బండమీద కూడినాము. మన బడిపిల్లోల్ల చేతుల మీదగానే మనూర్లో సంగం పని మొదులు పెట్టదాము. అందుకనే సంగంలో చేరే వాల్లంతా, ఈ బుక్కుల్లో పేర్లు రాపించెతే మొదలు బెట్టినట్టవుతాది " గంగులయ్య నోటుపుస్తకాన్ని విద్యార్థుల చేతికిచ్చాడు- పేర్లు రాయడం కోసం.

గంగులయ్య అభిప్రాయంతో అందరూ ఏకీభవించారు.

ఎల్లయ్య, రంగయ్యతాత, పెద్దోళ్ళు అంతా యువకులు చేస్తున్నదానికి మద్ద తిచ్చి అంగీకరించారు.

విద్యార్థి నాయకుడు నోటుబుక్‌లో 'రైతుకూలీసంఘం' పుంగనూరు తాలూకా, రామిరెడ్డిపల్లె అని రాసి, సభ్యులపేర్లు రాశాడు. అందరూ కలసి 'గంగులయ్యను' సంఘానికి అధ్యక్షునిగా, గుర్రప్పను కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

"రైతుకూలీ సంఘం వర్ధిల్లాలి
దున్నేవానికే భూమి
విప్లవం వర్ధిల్లాలి"

విద్యార్థుల గొంతుకు రైతుకూలీల గొంతులు తోడై నినాదాలు దద్దరిల్లాయి. కొండలుతాకిన నినాదాలు ధ్వని పలికాయి.

చింతతోపు మిద్దెలో పరుపుమీద హాయిగా నిద్రిస్తున్న భూస్వామికి తనపునాది కదిలిపోతున్నట్లు, పేదల్ని పీడించి కట్టుకున్న భవనం కూలిపోతున్నట్లు కలగంటూ, రైతుకూలీల నినాదాలు చెవులకు సోకడంతో ఉలిక్కిపడి లేచి, కళ్ళు నులుముకుంటూ బయట వరండాలోకొచ్చాడు.

వెన్నెల పిండారబోసినట్లుంది, చెట్లకింద నీడలు కదులాడుతున్నాయి. బండ మీద గుమికూడి కూర్చున్న జనం తన నిద్రమత్తు కళ్ళకు మసగ్గా కనుపించారు. చెవులకు రాసుకొనిపోతున్న చల్లగాలిలోంచి పాట క్షీణంగా వినిపిస్తావుంది.

"రండిరో కూలన్నా సంగం పెడదాము
సంగతేందో చూద్దాము రండిరో"

అంటూ పాడుతున్న పాటతో సమావేశం ముగించుకొని బండమీద నుంచి జనం కదిలివస్తుంటె, భూస్వామి గురునాథరెడ్డికి ఒల్లు గగుర్పొడిచి, కళ్ళు బైర్లు కమ్మినట్లయింది.

* * *

ఉదయాన్నే లేచి మాలపల్లి పిల్లోళ్ళు చింతచెట్లకిందకు పరుగెత్తారు. రాలిన చింతకాయలన్ని ఏరి, రోజుమాదిరిగానే గురునాథరెడ్డి ఇంటిదగ్గర కుప్పపోసి వచ్చారు.

ఎల్లయ్య కూతురు చిన్నబిడ్డ 'అచ్చుమక్క' మాత్రం, ఏరిన కాయలు కొన్ని మాత్రమే అందరితో పాటు కుప్పలోపోసి, మిగిలిన కాయలు చెట్టుకింద దాచిపెట్టి, ఆకులు కప్పింది.

మిట్ట మధ్యాహ్నం ఎండ తీక్షణంగా కాస్తావుంది. ఎండాకాలం కాకపోయినా ఎండమాత్రం మాడకాగుతా వుంది. అచ్చుమక్క భూస్వామి యింటివైపు వరండాలో ఎవరూలేరని చూసి, దాచిపెట్టినవి కాయలు ఎత్తుకురావడానికి చెట్టుకాడకు పరుగెత్తింది. కాయలు ఒళ్ళో పోసుకొని రోడ్డెక్కేటప్పటికి సీతాదేవికి, రావణాసురుడు ప్రత్యక్ష

మైనట్లు, టౌనుకు పోయివస్తున్న గురునాథరెడ్డి, సైకిల్ మోటారు మీద ప్రత్యక్ష మైనాడు.

గురునాథరెడ్డిని చూస్తూనే, అచ్చుమక్క బిత్తరపోయి, చేతిపట్టు నుండి ఒడి జారవిడిసింది. ఒళ్ళో చింతకాయలు, పళపళమని కిందపడ్డాయి. ఒళ్ళంతా చెమటపట్టి గడగడ వణుకుతూ నిలబడింది.

గురునాథరెడ్డి సైకిల్ మోటారుదిగి స్టాండువేసి "ఏమే పిల్లలంజా ముండా కాయలు మీ తాత సొమ్మనుకున్నావ, నీయమ్మ ...." అంటూ జుట్టుపట్టి ఈడ్చి, చెంపలమీద కొట్టి, ముందుకు తోపుతోశాడు. అచ్చుమక్క ఆ తోపుకు విసరకపోయి, బోటు రాతిమీదపడి స్పృహతప్పింది. తలనుంచి రక్తం రాకపట్టింది.

దూరంగా చెట్టుకింద ఆడుకుంటూవున్న పిల్లలు, ఈ తతంగం అంతా చూసి పరుగెత్తుకొచ్చారు. రక్తంలో స్పృహతప్పి వున్న అచ్చుమక్కను చూసి ఇండ్లల్లో వాళ్ళకు, చేలల్లో పని చేసేటోల్లకు చెప్పిరావడానికి పిల్లలు ఎల్లినారు.

పెద్దోళ్ళు వచ్చేలోపలే గురునాథరెడ్డి మెల్లగా అక్కడినుండి జారుకున్నాడు.

గంగులయ్య పడిపోయిన బిడ్డను భుజాన్నేసుకొని, గురునాథరెడ్డి ఇంటిదగ్గరకు వెళ్ళాడు. ఆడోళ్ళు, మొగోళ్ళు వూర్లో జనమంతా కూడి అక్కడికే చేరారు.

గంగులయ్య బిడ్డను వరంతాలో పెట్టాడు. "ఎధవ చింతకాయలకోసం బిడ్డను రక్తమొచ్చేట్టుగా కొట్టినావు. అసలు చింతచెట్లకు నువ నీళ్ళుపోసి పెంచినావా ? మా యిండ్లల్లో చెట్లకాయలన్నీ ఇన్నిరోజులు నువ్వే తిన్నావు. ఈ రోజునుంచి మేము చింతకాయలు నీకిచ్చేదిలేదు. ఎవురిండ్లల్లో కాయలు వాళ్ళే ఏరుకుంటారు. మా పిల్ల కాయలమీద చేయి చేసుకుంటే మేమొప్పుకోం. ఈ పొద్దు మాబిడ్డ పానానికేమన్న జరిగితే నీ అంతు చూస్తాం" గంగులయ్య మాటలకు ఒకదానికి కూడా జవాబివ్వ కుండా గమ్మున లోపలికెళ్ళిపోయాడు గురునాథరెడ్డి.

భూస్వామిదే ట్రాక్టరు తీసుకొని, బిడ్డను ఆసుపత్రికి తీసుకుపోయారు.

ఆడవాళ్ళు మాత్రం గురునాథరెడ్డి ఇంటిముందు నిలబడి, ఎన్నిరకాల తిట్లుం టాయో అన్ని తిట్లు తిట్టారు.

"మా కడుపులు కాల్చి నువ్వెన్నిరోజులు ఈ బతుకు బతుకుతావురా, ఆకిరికి మా బిడ్డల్నికూడా చీల్చుక తింటన్నావు కదరా, ఆ బిడ్డను కొట్టను నీ చేతులెట్లాడినా యిరా, రాచ్చేసుడా ? నీ చేతల్లో పురుగులుపడ, నీ వంశం కూలిపోను, నిన్ను కలరాచ్చెత్తకపోను" అంటూ ఆడోల్లు ఇంటిమీద దుమ్మెత్తిపోసి తిట్టిపోయారు.

* * *

రాత్రి పూర్లో అందరూ సమావేశమయ్యారు. బిడ్డ క్షేమంగా తిరిగొచ్చేదాకా ఎవరూకూడా పనికి పోకూడదని నిర్ణయించుకున్నారు.

ఆసుపత్రికి వెళ్ళినవాళ్ళు ఎవరూకూడా తెల్లవారి రాకపోయేటప్పటికీ, మాల పల్లిలో అందరూ పనులకు వెళ్ళకుండా మానేశారు.

భూస్వామి ఆరోజు, టమేటా నారును ఆరవై గుంట్లకు నాటించాలనుకున్నాడు. అది అట్లే ఆగిపోయింది.

ఆగిపోయిన దాన్నిగురించి భూస్వామి కూడా పట్టించుకోలా. ఆసుపత్రికితీసక పోయిన బిడ్డకు, ప్రాణానికేమన్నా జరిగితే, తనపైన వాళ్ళేమైనా చేసి తీరుతారని గురునాధరెడ్డికి భయంగానే వుంది.

అందుకనే ఏ విషయం ముందుగానే కనుక్కొని రమ్మని సైకిల్ మోటరిచ్చి, మనిషిని పంపించాడు.

ఆసుపత్రికి పోయిన మనిషి, అన్ని విషయాలు తెలుసుకోని ప్రాణానికి పరవా లేదు, రక్తం చాలా పోయినందున రక్తమెక్కించినారు. ఇంకా రెండు రోజులుంట మని డాక్టర్లు చెప్పిన సంగతి విన్నతర్వాత గురునాధరెడ్డికి మనసు కుదటపడింది.

సంఘం నిర్ణయం ప్రకారం నాల్గు రోజులవరకు చేలల్లో అన్నిపనులు ఆగి పోయాయి. టమేటానారు గట్టన్నే ఎండిపోవడానికి సిద్ధంగావుంది. పయిర్లు నీళ్ళు గట్టేవాళ్లు లేక, భూస్వామి ముఖంలాగానే వాడుముఖం తగిలినాయి. గొడ్లకు మేత వేసేవాళ్ల లేక గొడ్లు కొట్టంలోంచి అరుస్తున్నాయి.

గురునాధరెడ్డికి ఏమిచేయాలో తోచలేదు. అప్పటికే పిచ్చి పట్టినట్లయింది. అతను ఎపుడూ అట్లాంటి పరిస్థితిని ఎదుర్కొనలా.

చివరికి సంఘం నిర్ణయానికి కట్టుబడతానని అంగీకరించాడు. బిడ్డను కొట్టి నందుకు జుల్మానా అయిదువందల రూపాయలు, ఆసుపత్రి ఖర్చులు కట్టించాడు.

బిడ్డ క్షేమంగానే తిరిగొచ్చింది. అయిదవరోజు యధాప్రకారం, అన్ని పనులు మొదలయ్యాయి.

ఆ రోజునుండి చింతకాయలేరి, భూస్వామి ఇంటిదగ్గర కుప్పబోసే సాంప్ర దాయం మూలబడింది. రాలినకాయలు ఎవరిండ్లకు వాళ్లు తీసకపోతున్నారు.

* * *

ఊరు చివరనున్న ఎల్లయ్య తాత యింట్లో, బాగా చీకటిపడిన తర్వాత, సంఘంలో ముఖ్యమైన వాళ్ళ సందర్ని గంగులయ్య సమావేశపరిచాడు. అందరూ 'రాజప్ప' కోసం ఎదురు చూస్తు కూర్చున్నారు.

రాజప్పను చూసి చాలారోజులైనందున, అందరికి ఆయన కళ్ళల్లో మెదిలి నట్లుంది. అనుకొంటూ ఉండగానే రాజప్ప వచ్చేశాడు. వెంబడేవున్న కొరియర్ బయటే నిలబడి పోయాడు. రాజప్ప వస్తూనే అందరికి విప్లవాభివందనలు తెలియ చేశాడు.

అందరూ వచ్చినారని తెలియచేసిన తర్వాత 'రాజప్ప' మాట్లాడడం మొదలు పెట్టాడు.

"కామ్రేడ్స్ ప్రజాబలం ముందు అధికారబలంగాని, ధనబలంగాని నిలవలేదు. ప్రజాశక్తి అజేయమైంది. ఆ శక్తిముందు ఏ శక్తి నిలవదని పోరాడేశక్తి ఋజువు చేస్తుంది. ఆ బాటలో ముందుకు సాగుతున్న మీకు నా విప్లవాభివందనాలు. మీరంతా ఐకమత్యంతో సంఘబలాన్ని బాగా పెంచారు. మీ ప్రభావంతో చుట్టు పక్కల గ్రామాలలోకి కూడా ప్రచారం ప్రాకింది. వాళ్ళ గ్రామాలలో సంఘాలు పెట్టుకోవ డానికి ఉత్సాహం చూపుతున్నారు. ఈ ఊళ్ళో పెరుగుతున్న సంఘశక్తి ప్రభావమే దానికి కారణం. ప్రచారం స్థాయినుంచి, ప్రజాపంచాయితీలు నిర్వహించే స్థాయికి ఎదిగి, ఈ రోజు భూమినాక్రమించుకోవడానికి, పోరాడడానికి మనం సిద్ధంగా ముందుకు సాగుతున్నాం.

మనం సంఘం ఏర్పాటు చేసుకున్నది భూమికోసం, భుక్తికోసమే. తరతరాలుగా మనల్ని మోసం చేసి, దగా చేసి, దోపిడీ చేసి, అన్యాయంగా ఆక్రమించిన భూస్వాముల భూములు, పోరాటంద్వారా తిరిగి సాధించుకోవడమే సంఘం యొక్క ధ్యేయం. మనం 'దున్నేవానికే భూమి' కావాలంటున్నాం అంటె, అది అన్యాయం కాదు. ఎందు కంటె, పందలాది, వేలాది ఎకరాలు భూములున్న ఆసాములు, వాళ్ళు పుట్టేటపుడు వాళ్ళ వెంట తీసుకురాలేదు. ఎవరైనా తల్లిగర్భం నుంచి బయట కొచ్చేటపుడు రక్తాన్ని పంచుకొని పుడతాడు గాని, భూమిని వెంట పెట్టుకొని పుట్టడు. భూమి మీద పుట్టిన ప్రతి ఒక్కడికి, భూమిచిదున్ని సాగుచేసే హక్కుంది. కాని కొందరు ఆ హక్కును కాలరాచి, మోసంతో సొంతం చేసుకున్నారు. వాళ్ళే భూస్వాములు. వాళ్ళు దోచుకొని దౌర్జన్యంచేస్తే భూమి వాళ్ళ సొంతమైంది. ఆ భూస్వాముల హస్తాల

నుండి, భూతల్లిని విముక్తిచేసి బిడ్డలందరికీ, భూతల్లి స్తన్యాన్ని అందించి కడుపు నింపడమే విప్లవం".

రాజప్ప చెప్పడం ఆపినవెంటనే, అందరూ ఒకే దృష్టితో మనసంతా చెప్పే దానిపైనే వుంచి, శ్రద్ధగా వింటున్న వాళ్ళు ఒక్కసారిగా వూపిరి పీల్చుకున్నారు.

"గుట్ట కింద బంజరు భూమిలో కంపచెట్లు కొట్టొచ్చి, భూసామి ఒడిచెట్లు నాటతాడంటకదా! మరట్టయితే ఆ భూమిని ముందు మనమే కదా ఆక్రమించుకున్నాము. అపుడంటె పట్టా ఉండాదని బెదిరిచ్చినాడు. ఇపుడు మల్లా ఒకసారి పోయిచెప్పి, అది మాకే చెందాలనడుగుదాము ఏమంటాడో"

మూలగా కూర్చున్న ఎల్లియ్యతాత తన మనసులో మాట చెప్పాడు.

"ఆ భూమి సంగతి ఆలోసించాలనే, మనమంతా కూడింది· వాల్లు మాట్లాడ తార్లే నువు కూసో" ప్రక్కనే కూర్చున్న అతను తాతను కూర్చోపెన్నాడు.

'రాజప్ప' మాట్లాడ్డం ప్రారంభించేటప్పటికి, గుసగుసలు, ఆపి అందరూ నిశ్శబ్దమయ్యారు.

"ఆ తాత చెప్పినట్టు ముందు భూమిని ఆక్రమించింది మనమే. అయితే భూస్వామి పట్టావుందని బెదిరించాడు వదిలేసినాము, ఆరోజు మనమధ్యన ఐకమత్యం లేదు. ఈ రోజు ఐకమత్యంవుంది. ఇపుడు భూస్వామిదగ్గరకు పోయి, ఒకప్పుడు, మేము చెట్లుకొట్టి ఆక్రమించుకున్నాము. ఆభూమి మాది, కాబట్టి వదిలేయ్. అని అడిగితే, ఆయన ఊరికే వదలడు - ఇదినాభూమి, నాకే హక్కుంది అంటాడు. మీ భూమయితే పట్టా తీసుకొని రాపోండి అంటాడు. ఎందుకంటె చీమలపుట్టలోకి పామొచ్చి బుసకొట్టి, పుట్టనాక్రమిస్తాది. ఈ పుట్టమాది, మేము కష్టపడి పెట్టుకున్నాము అనిచీమలు వేడుకుంటాయి. కాని, పాము ఊరకుండదు బుసలు కొట్టి, తోకతో కొట్టి చీమల్ని చంపుతాది. ఇ చీమలే బెదిరిపోకుండా కలిసికట్టుగా పామును చుట్టు ముట్టితే, పాము చస్తాది.

కాబట్టి మనం భూస్వామిని వేడుకోవడంకాదు. ఆభూమిపైన మనకు హక్కుంది. అందులో చెట్లునరికి, తిరిగి భూమిని ఆక్రమించాల్సిందే. అది సంఘ నాయకత్వంలో, పోరాటం ద్వారా సాధించాల్సిందే గాని భంగపాటుతోకాదు. అందుకలసి మీ కందరికి ఆమోదమైతే భూమిని ఆక్రమించుకోవడానికి సిద్ధం కావాలని కోరుతున్నాను."

రాజప్ప చెప్పిన దాన్ని విన్న తర్వాతే, పోరాటంద్వారా భూమిని ఆక్రమించ డానికి సిద్ధమేనని జవాబిచ్చారు.

తర్వాత 'గంగులయ్య' తన అభిప్రాయం చెప్పడానికి లేచాడు.

"కామ్రేడ్స్, ఎన్ని ఆటంకాలొచ్చినా ఎదిరించి నిలబడి భూమిని ఆక్రమించు కోవాల. ఇప్పటికే మన ఐకమత్యాన్ని, బలాన్ని చూసి భూస్వామి బిత్తర పోతన్నాడు. భూస్వామికి అండొచ్చే వాళ్ళు ఇక్కడెవరూలేరు. వచ్చితే కలికిరో, వాయిల్పాడు నుంచో భూసాములండతో రావాల్సిందే. ఎవరొచ్చినా మనం ఎనకెళ్ళి పోకుండా నిలబడి పోరాడాల. ముందు మనం చెట్లు కంపమండలు కొట్టి సదరు పెట్టాల. మల్ల మండలు కట్టి దున్నాల. ఇవన్ని పథకమేసుకొని చెయ్యాల. అందుకని, ముందుగా కంపచెట్లు నరికేదానికి, ఒక్కొక్క యింట్లోనుంచి తప్పకుండా రావాల. ఈ పనంతా రేపటినుంచే మొదలు బెట్టాల" అని గంగులయ్య చెప్పిన అభిప్రాయాన్ని అందరూ అంగీకరించారు. అందరూ శలవు తీసుకొని వెళ్ళిపోయారు.

గంగులయ్య, గుర్రప్ప, నారాయణలు ఏవిధంగాచేయాలో రాజప్ప కార్య క్రమాన్ని వివరించాడు. అన్ని చర్చించిన తరువాత రాజప్ప, కొరియర్‌తో కలసి వెళ్ళి పోయాడు.

* * * *

కూలీల కండ బలానికి కొండలైనా కరిగిపోతాయని, ఊరి జనం చేతుల్లో ఆడిన కత్తులు, గొడ్డళ్ళ ధాటికి, అడివిలాగుండిన నలభై ఎకరాల బంజరంతా మైదాన మైంది. సుమారు రెండు లారీలు కట్టె కుప్పబడింది. కంపనంతా చుట్టూ కంచె కట్టారు.

గురునాథరెడ్డి కలికిరికి వెళ్ళి, తనబంధువులను, భూస్వాములండ కోరి కొట్లా టకు మనుషులను పిలిపించుకున్నాడు.

ఎక్కువగా ఆటంకం కల్గితే వెంటనే అరెస్టుచేసి లాకప్పులో తోసించడానికి, పోలీసులకు లంచమిచ్చి ప్లాను సిద్ధం చేసుకున్నాడు.

సూర్యుడు ఎర్రగా మెరుస్తూ పుట్టుకొస్తున్నాడు. భూమిపుట్టి రావడానికి ఎక్కడ ఆలస్యం అవుతుందో నన్నట్లుగా, పుట్టిందేతడవు పరుగులు దీస్తున్నాడు, తన తీక్షణ మైన కిరణాలు భూమి మీద వెదజల్లుతూ కొండమీదకు ఎగ బ్రాకు తున్నాడు.

కొండకు దిగదాల పోడు కొట్టిన మైదానమంతా, రణరంగం కాబోతున్నట్లుంది.

రైతులు ఎర్రజండాలతో, మడకలు కట్టుకొని, 'దున్నేవానిదే భూమి', 'రైతు కూలీ సంఘం వర్ధిల్లాలి' అంటూ అక్కడికొచ్చారు.

భూస్వాములు ట్రాక్టరులో మనుషుల్ని తీసుకొని, కత్తులు, కటార్లతో దాడి చేయడానికి సిద్ధమై వచ్చారు.

ఇరువైపుల మాటకు మాట పెరిగింది. చేతల కాడి కొచ్చింది. "రేయి కొట్టండ్రా నాకొడుకుల్ని, వదలద్దు, పట్టుకోండి, ఎక్కించండి" అంటూ ట్రాక్టరును దున్నే మడికల మీదకు పోనిచ్చారు. కాడికి ఉన్న ఎద్దులు పరుగెత్తుకెళ్ళాయి. కొన్ని కాడి అంకెలిరిగిపోయి, అక్కడే కూలబడ్డాయి. భూస్వామి బంధువు తుపాకి పేల్చాడు.

మనుషులు చెల్లాచెదరయ్యారు. కొందరు అరుస్తూ కేకలేస్తున్నారు. కొందరు ఏడుస్తూ మొత్తుకుంటున్నారు. గూండాలు కత్తులూ, కట్టెలతో బాదుతున్నారు.

సమయానికి పోలీసులు వచ్చేశారు. పోలీసులు వచ్చినారు ఇక పరవాలేదు, రక్షిస్తారనుకొని ఆశపడ్డారు కూలీలు. కానీ పోలీసులే గూండాల కన్నా లాఠీలతో ఎక్కువగా కూలీలను బాదారు. గాలిలో తుపాకిని పేల్చారు పోలీసులు. జనం చెల్లాచెదురయ్యారు.

గంగులయ్య, నారాయుడు గురప్పతోపాటు నలభై మందిని రెండు వ్యానుల కెక్కించుకొని, పుంగనూరు స్టేషన్‌కు తీసుకెళ్ళి కేసు నమోదు చేశారు.

సంఘంలో చురుగ్గా పనిచేసేవాళ్ళంతా, అరెస్టయి పోవడంతో భూస్వామికి ఎదురు లేకుండా పోయింది. ట్రాక్టరు పెట్టి భూమినంతా దున్నిచ్చాడు.

దౌర్జన్యంతో, పోలీసు అండతో, గూండాలతో కూలీలను బెదిరించి భూమిని దున్నించుకోగానే ఆ భూమి తనదైనట్లు, ఇంకెవరికీ హక్కు లేనట్లు సంబర పడ్డాడు గురునాథరెడ్డి.

* * * *

వారం రోజులవుతున్నా అరెస్టు చేసిన వారిని ఎవరిని కూడా కోర్టులో ప్రవేశ పెట్టకుండా స్టేషన్‌లో చిత్రహింసలు పెట్టారు.

జిల్లా అంతటా ఆందోళన ప్రారంభమైంది. పౌరహక్కుల సంఘం, రాడికల్ యువజన సంఘాలు, కరపత్రాలు కొట్టించి, పోస్టర్లువేసి, అక్రమ అరెస్టుల్ని ఖండిస్తూ ప్రచారం సాగించింది.

"భూస్వాముల జులుం - నశించాలి.

అక్రమ అరెస్టుల్ని - ఖండించండి.

అరెస్టయిన కామ్రేడ్స్‌ను వెంటనే - విడుదల చేయాలి" అంటూ విద్యార్థులు - యువకులు, స్త్రీలు ఊరేగింపుగా సాగారు. కోర్టుదగ్గర పికెటింగ్ ప్రారంభమయింది. పాటలతో నినాదాల హోరుతో కోర్టు పునాదులు కదులుతున్నాయా అన్నట్లు ధ్వని పలుకుతోంది.

అన్యాయస్థానంలో కళ్ళకు గంతలు కట్టి బంధించబడిన న్యాయదేవతకు చూపులేకాదు, చెవులు కూడా వినిపించకుండా సీసం పోశారేమో. అందుకనే స్వేచ్ఛ కోసం, న్యాయంకోసం, హక్కుల కోసం గొంతెత్తి అరుస్తున్న బిడ్డల పిలుపు ఆమెకు సోకనైనా లేదు.

జనం గుంపులు గుంపులుగా గుమికూడుతున్నారు. జనంతో పాటుగా పోలీసులు కూడా తుపాకులతో, లాఠీలతో అక్కడికొచ్చేశారు.

సన్నగా మెరికలాగా ఉన్న యువకుడు కోర్టు వరండాలో ఎత్తుగా వున్న చోటునుంచి మాట్లాడుతున్నాడు.

"ప్రజలారా! రాడికల్స్ ఎవరన్న సంగతి మీకందరకు తెలుసు, ఎందుకంటె ఈ రోజు రాడికల్స్ ప్రభావం లేని జిల్లా అంటూ లేదు. వాళ్ళ ప్రజలలో బిడ్డల్లాగా కలిసిపోయారు. అట్లాగే మన జిల్లాలో కూడా పేద ప్రజల్ని కూడగట్టి, రాడికల్ యువజన సంఘాలు, రైతుకూలీ సంఘాలు ఏర్పాటు చేసి భూస్వాములకు వ్యతిరేకంగాను, లంచగొండితనానికి, అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగాభూమికోసం, భుక్తికోసం పోరాడుతున్నారు. పేద ప్రజలంతా సంఘాలు పెట్టుకొని పోరాడుతుంటె, భూస్వాములు తమ పునాదులు కదులుతున్నాయని, తమ పెత్తనం పోతున్నదని బెంబేలెత్తిపోతున్నారు. పేద రైతాంగం మీద, కూలీల మీద దాడులు సాగిస్తున్నారు. భూస్వాముల అన్యాయాలు అరికట్ట లేని పోలీసులు, భూస్వాములకు తొత్తులుగా మారి, కూలీల మీద అక్రమ కేసులు బనాయించి, అరెస్టులుచేసి, స్టేషన్లలో చిత్రహింసలు పెడుతున్నారు.

"రామిరెడ్డిగారి పల్లెలో భూస్వామి అక్రమంగా ఆక్రమించిన బంజరు భూమిని పేదలంతా కలిసి చెట్టు, పుట్ట కొట్టుకొని దున్నుకుంటూ వుంటే గూండాలచేత కొట్టించి, కేసులు పెట్టి నలభై మందిని అరెస్టు చేపించాడు. ఇప్పటికి వారంరోజులవుతున్నా

కోర్టులో హాజరు పరచలేదు. వారిని హింసిస్తున్నారు. అందుకే మేము చెబుతున్నాం. ఈ పోలీసులు, కోర్టులు, ప్రభుత్వాలుండేది పేదవారి కోసం కాదు. పెత్తందార్లకు ఊడిగం చేయడానికేవున్నాయి. కాబట్టి మీరు బాగా ఆలోచించండి. ఈ రోజు తంబళ్ళ పల్లి, వాయిల్‌పాడు, మదనపల్లి, పుంగనూరు తాలూకాలలో రైతాంగం మీద భూస్వాములు, పోలీసులు కలసి విపరీతంగా దాడులు చేస్తున్నారు. అయితే మీరు ఈ జరుగుతున్న దాడులు మా మీద కాదులే అని అనుకొని గమ్మున వుండొచ్చు. కాని, ఆ దాడులు అక్కడ వాళ్ళకే పరిమితం కాదు, రేపు మీ గ్రామాల్లో కూడా, హక్కుల కోసం, న్యాయం కోసం అడిగితే, అపుడు మీ మీద కూడా దాడులు సాగిస్తారు. అందుకే ప్రజాస్వామిక వాదులంతా రైతాంగంపై జరుగుతున్న పోలీసు, భూస్వాముల దాడులను ఖండించి అరెస్టు చేసినవారి విడుదలకై డిమాండు చేస్తూ, వారి పోరాటానికి మద్దతివ్వాల్సిందిగా కోరుతున్నాం".

విద్యార్థి నాయకులు చెప్పిన మాటలు విని, కరతాళధ్వనులతో మద్దతు తెలిపారు.

"రైతుకూలీ సంఘం – వర్థిల్లాలి

అరెస్టయిన కామ్రేడ్స్‌ను – వెంటనే విడుదల చేయాలి" అంటున్న నినాదాలు తారాస్థాయి నందుకున్నాయి.

* * *

అరెస్టయిన కామ్రేడ్స్ అందరూ విడుదలైవచ్చారు. ఆ రోజే మడకలు కట్టుకొని, ఎర్రజెండాలతో ఊరేగింపుగా కొండ కిందకు కదిలారు.

భూస్వామి ట్రాక్టరుతో దున్నిన భూమిని తిరిగి మరలా దున్నారు.

దుక్కి బాగా దున్నిన తరువాత, అదను చూసి భూమిలో ఉలవ గింజలు చల్లారు. కొంత భూమిలో టమేటా చెట్లు నాటారు.

మంచి అదనులో పడిన ఉలవ గింజలు బాగా మొలిచాయి.

సంఘం బలం మరింతగా పుంజుకొని, దెబ్బలు, చిత్రహింసలు తట్టుకొని ముందుకు సాగుతున్నట్టుగానే ఉలవ పైరు, టమేటా చెట్లు కూడా బాగా పెరుగుతున్నాయి.

కొండ కింద భూమికి 'సంఘమోల్ల భూమి' అని పేరు పడిపోయింది.

భూస్వామి గురునాధరెడ్డి ఊళ్ళో వచ్చిన మార్పును చూసి, మింగలేక, కక్క

లేక కోరలు పెరికిన నాగులాగా బుసలు కొట్టుకుంటున్నాడు.

మునుపటి మాదిరిగా కూలీలు ఎవరూ అతన్ని లెక్క చేయడంలేదు. గురునాథ రెడ్డి ఇంటిని వదలి రాకుండా ఉన్నాడు.

గురునాథరెడ్డి తెల్లవారి పేపరులో ముందు పేజీలో పెద్దక్షరాలతో పడిన "కలికిరిలో భూస్వామి హత్య" అనే వార్తను చూసేటప్పటికి నోటినుండి మాట రాకుండా, ఒళ్ళంతా చెమటపట్టి ఒనుకు పుట్టనారంభించింది.

వార్తను చూసినప్పటి నుండి వారం రోజులు అన్నం తినడం మానేశాడు. తనకు నిద్రలోకూడా కలవరింతలొస్తున్నాయి.

ఆ రోజు సాయంత్రం కానూరు నుంచి తన స్నేహితుడు సర్పంచి రాజిరెడ్డిని పిలిపించాడు.

"ఏమన్నా, అర్జెంటుగా రమ్మన్నావంట ఏమి సంగతి" అంటూ సర్పంచి పరుగెత్తు కొచ్చాడు.

"ఏమీలేదు చిన్న పనుంటె రమ్మన్నాను. నీతో వాడు గంగులుగాడు, బాగానే మాట్లాడతాడు కదా" గురునాథరెడ్డి.

"ఏ గంగులుగాడు, ఎవురన్నా నువు చెప్పేది?" సర్పంచికి విషయం అర్థం కావడం లేదు.

"అదేనయ్యా సంఘమోళ్ళ సంగతి, వాడు మాలోడు; గంగులుగాడు సంగతి నేను చెప్పేది". సంఘం అనడం గురునాథరెడ్డి కిష్టముండదు. మాలోడు అనడమే తన కిష్టం కాబోలు.

సంఘమోళ్ళు అనేటప్పటికి, గురునాథరెడ్డికన్నా రెండింతలుగానే సర్పంచికి భయమేసింది, నాలిక మీద తడారిపోయింది.

"ఈడు నాకు, వాళ్ళకే ఎమన్నా, జుట్లు ముడేయాలనుకుంటున్నాడో ఏమొ. వాడి మాదిరిగానే నేను కూడా చికులాడై వాడికి సంతోషం" అని మనసులో అనుకున్నాడు సర్పంచి.

పైకి మాత్రం "అబ్బే, ఏమంటె ఏమని అనడమేగాని, అసలు నాకూ వాళ్ళకూ సంబంధమే లే...." అని సర్పంచి నసుగుతూ అంటూ వుండగానే గురునాథ రెడ్డి మధ్యలోనే అందుకున్నాడు.

" నీకు వాళ్ళతో సంబంధాలుండాయని అనుమానించడం లేదులే గాని, వాడితో నా గురించి మాట్లాడాల. అదే భూమి సంగతి తకరాదా ఉండాది కదా! దాని విషయంలో నేను రాజీ పడతాను అని వాడితో ఒక మాట చెప్పి మా మధ్యన రాజీ చెయ్యాల. అందుకోసమే నిన్ను పిలిపించింది." గురునాథరెడ్డి అసలు విషయం చెప్పేటప్పటికి, సర్పంచి రాజిరెడ్డికి భయమంతా తొలగి పోయింది.

"అయ్యో, ఆ విషయానికింత చెప్పాలంటన్నా. నేను పోయి మాట్లాడతానులే. నువ్వు హాయిగా వుండు" సర్పంచి అభయమిచ్చినట్టు చెప్పాడు.

ఏదో మధ్యవర్తిగా వుండి, తానే ఆపని చెయ్యగలిగానని, సంఘమోల్ల దగ్గర గంగులయ్యతోను మెప్పు పొంది, భవిష్యత్తులో తనమీద సంఘమోల్ల దృష్టి పడకుండా చేసుకోవచ్చనుకున్నాడు.

వెంటనే సర్పంచి, గంగులయ్య దగ్గరకెళ్ళి రాజీ అయ్యే విషయం చెప్పాడు.

"రాజీ పడదలచుకుంటె, ఆ చెప్పేదేదో సంఘం సమచ్చంలోనే చెప్పాల, అంతే, చాటుమాటు బేరాలు, మంతనాలు పనికిరావు" గంగులయ్య ఆ మాట అనేసి సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు.

భూస్వామి ఒకవైపు సంఘమోల్లతో, రాజీ బేరాలు సాగిస్తూనే మరోవైపు తన రక్షణ కోసం, లంచం పోసి, తన యింటి దగ్గర పోలీసు క్యాంపు పెట్టించుకున్నాడు.

* * *

పోలీసు క్యాంపు పెట్టడంతోనే ఊరివాతావరణంమారిపోయింది. ఊరికియమభటులొచ్చినట్లయింది. ప్రతిరోజు ప్రొద్దుకుంకిన వెంటనే అందరి ఇండ్లల్లోను ఒకటే గోల.

"ఏమమ్మే రామక్కా ! మాది గుడ్లు పెట్టేకోడి, నల్లపెట్ట అవపడ లేదమ్మే మీ ఓటిల్లో ఏమన్నా వచ్చిందేమో చూడు " అని ఒకామె అంటె.

"మాది కూడా పూలకోడి, పుంజు అవపడలేదక్కా ! దానికోసమే ఎతికెతికి అల్లాడితన్నా" అంటూ ఎదురింటామె జవాబు.

"మనూరొచ్చినారు కదె ! రాచ్చేసులు ! యాడకోళ్లు వాళ్ళ బాన కడుపులకు సాలడంలే, ఇంకెందుకే ఎతకడం దండగ. ఆపెట్టదాన్ని, పుంజును రెంటిని, ఆ పోలీసు నాబట్టలే కోసుకోనుంటారు పోండి" ఇంకో ముసిలామె ఉన్నది ఉన్నట్టు చెప్పుతుంది.

ప్రతిరోజు ఊర్లో అదేవిధంగా వుంటుంది.

క్యాంపు పెట్టినప్పటి నుండి, గంగులయ్యకోసం గాలిస్తూనే వున్నారు. రాత్రుళ్ళు ఊరు మీద దాడిచేయడం, సంఘమోళ్ళు వచ్చినారంట, ఎక్కడ చెప్పండని వేదించడం జరుగుతోంది.

గంగులయ్య రహస్యంగానే, కార్యక్రమాలు సాగిస్తున్నాడు. అయితే నాయకుడు రాజప్ప కలవడానికి వీలుండడంలేదు. క్యాంపు వచ్చిన తరువాత గంగులయ్యకు సరిగా సమాచారం అందటం లేదు.

* * *

సాయంత్రం సూర్యుడు చల్ల బడుతున్నాడు. క్యాంపు ముందు సెంట్రీ, ఆ దారిన ఎవడన్నా వస్తాడేమో, అని కాచుకోని వున్నాడు. లోపల హెడ్డు, కాలుకాలు మీద, వేసుకోని పండు కోనున్నాడు. మిగతా పోలీసులు ఊరిమీద గస్తీకెళ్ళారు,

నెత్తిన కట్టెలమోపెత్తుకోని దూరంనుంచి వస్తున్నకుర్రాడు, సెంట్రీచూపులో పడ్డాడు.

"సార్ దూరంగా, ఒక కుర్రోడు కట్టెలమోపెత్తుకోని వస్తన్నాడు సార్ " సెంట్రీ హెడ్డుకు చెప్పాడు.

"అది కూడా నాకు చెప్పాలంటరా పిచ్చి నాలుగుతన్ని పనికి పురమాయించు. త్వరగా అవ్వాల నాకు ఆకలిగా వుంది. " హెడ్డు కోపంగా ఆర్డరిచ్చాడు.

హెడ్డుగారి ఆర్డర్ని శిరసావహించిన సెంట్రీ, కుర్రాడిని కేక వేసి పిలిచాడు.

"రేయ్ కట్టెల మోపోడా, నిన్నే, ఇట్లరారా ? "

పిల్లవాడు భయపడుతూ క్యాంపు దగ్గర కొచ్చాడు. "ఏమోయ్ పిలుస్తా వుంటె, యినపడలా, దర్జాగా, దొరకొడుకు మాదిరిగా ఈలేసుకుంటూ పోతున్నవే. " అంటూ తలమీద దెబ్బవేశాడు. అప్పటికే పిల్లోడు మోపుకింద పడేశాడు.

"అయ్య పిలుస్తున్నాడు లోపలికిపదా" అంటూ హెడ్డు దగ్గరకి లాక్కెళ్ళాడు.

"ఏమోయ్ మమ్మల్నిచూసి ఈల వేసుకుంటు పోతన్నావా? ఆ—" గదమాయించాడు హెడ్డు.

"లేదుసా, నేను గమ్మన్నే పోతన్నా సా దండంపెత్తా నన్ను కొట్టొద్దు సా " పిల్లవాడు.

"నీకు కోడిని కోసే దొస్తాదా రా" హెడ్డు.

"నేనెప్పుడూ కొయ్యలా సా" పిల్లవాడు.

"పోయి, కొ సేయ్ పో, అదే వస్తాది. లేకుంటె కీళ్ల యిరిచేస్తాం " అంటూ పోలీసు మాత్రం చెప్పి, ఒకతన్ను తన్నాడు.

సెంట్రీ పిల్లవాణ్ని, వెనక్కి పిల్చుకొనిపోయి, ప్రాణం తీసేసిన రెండు కోళ్ల చూపించి, త్వరగా పనికానిమ్మని చెప్పాడు.

అప్పటికే అలసిపోయిన పిల్లోడు ఏడ్చుకుంటూ ఈకలు పెరకడం ప్రారంభించాడు.

వాటిని కాల్చి కోసేటప్పటికి బాగా చీకటిపడింది.

"మాఅమ్మ తిడతా ఉంటాది నేను పోతా సా " పిల్లవాడు ఒనుకుతూ అడిగాడు.

"ఏం రా కోడిని కొయ్యమంటె ముందు రాదంటివే. ఇపుడు ఎవురు నేరిపించినార్రా ? మీ అమ్మ నేరిపిందంటరా, లంజకొడకా " అంటూ హెడ్డు, పిల్లవాడి కడుపు మీద తన్నాడు.

"అమ్మా!" అంటూ పిల్లవాడు క్రింద పడిపోయాడు. పడిపోయినవాడిని జుట్టు పట్టిలేపి "మీయిండ్లకు రాత్రుళ్లు సంఘమోళ్ళు ఎవురోస్తారో, ఎక్కడి కొస్తారో చెప్పు."

"తెలీదుసా, నాకు నిజంగా తెలీదుసా" పిల్లవాడు ఒనుకుతూ ఉచ్చ కార్చేశాడు.

"పో, పోరా నాకొడకా బయటకుపో " హెడ్డు.

"లంజాకొడకా బొమ్మ మాదిరిగా చూస్తున్నావు. తరుమువాణ్ని " సెంట్రీని తిట్టాడు హెడ్డు.

పిల్లవాడు ఇదే సందుగా, కట్టెలమోపును కూడా వదిలిపెట్టి, ఇంటికి పరుగు దీశాడు.

పిల్లవాడు జరిగినదంతా ఊర్లోవాళ్ళకు చెప్పాడు. జనం క్యాంపు దగ్గరికి పరుగు తీశారు.

గస్తీకెళ్ళిన పోలీసులు ఒక యువకుడ్ని జుట్టుపట్టి ఈడుస్తున్నారు. అతను రానంటూ పెనుగులాడుతున్నాడు.

"ఎవడ్రావాడు, ఏమి సంగతి అంటూ హెడ్డుగాడు అక్కడి కొచ్చేశాడు.

"వీడు, మన మీద, రాడికల్స్ వేసిన కరపత్రాలు పంచుతున్నాడు సార్, అందు కని పట్టుకోని, మీ దగ్గరికి రమ్మంటె రానంటున్నాడు సార్" పోలీసులు వివరించారు.

"ఏంరా సాలె పిలిస్తే ఎందుకు రావురా లంజాకొడకా, తలేమన్నా తిరుగుతాందా" హెడ్డు కొట్టేదానికి చెయ్యెత్తాడు.

ఆ సమయానికే, జనం, గుంపులు, గుంపులుగా, కేకలేస్తూ, వచ్చేశారు.

"నాకొడుకులు చంపేస్తారు, పరుగెత్తండిరా, క్యాంపుకాడికి" హెడ్డుగారు పరుగెత్తాడు.

పోలీసులు, హెడ్డును అనుసరిస్తూ, చస్తిమో, బతికితిమో అనుకుంటూ, టెంటులోకి దూరారు.

జనం అదే అదునుగా, తమకు నోటి కొచ్చినట్లు తిట్టి కక్షతీర్చుకున్నారు.

గురునాధరెడ్డి ఇంటిలోనుండి, తతంగం అంతాచూస్తూ, తలపట్టుకొని కూర్చోని చూస్తున్నాడు. ఈ సమయంలో యింటి మీద పడితే ఇక దేవుడే దిక్కనుకున్నాడు.

*  *  *

రాత్రి బాగా చీకటి పడినాక. గంగులయ్య యింటికి వెళ్ళాడు. పక్కవల్లె కానూరు నుండి వచ్చిన మనిషి తన కోసం కాచుకోనున్నాడు.

అతనివెంట గంగులయ్య వెళ్ళాడు. అక్కడ రాజప్ప తనకోసం ఉన్నాడు. రాజప్పనును చూసేడప్పటికి, గంగులయ్యకు తన మనసులో ఆనందమంతాఒక్కసారి పెల్లుబికి నట్లయింది.

ఒకరినొకరు పిడికిలెత్తి రెడ్ శాల్యూట్స్ చెప్పుకున్నారు.

గంగులయ్య ఊరిలో విషయాలు అన్ని చెపుతుంటె, రాజప్ప శ్రద్ధగా వింటున్నాడు.

"రాజన్నే, నేను చానా రోజుల్నించి ఆలోసించి ఆలోసించి, ఈ పొద్దు ఒక మాట చెప్పాలను కుంటున్నా, అన్నా".

గంగులయ్య తనలోని సంఘర్షణ బయట పెట్టాడు.

రాజప్ప దాని గురించి ఆలోచిస్తూనే "సరే చెప్పు గంగులన్నా" అన్నాడు.

"నేను పూర్తికాలం పనిచెయ్యాలని నిర్ణయించుకున్నాను. నన్ను పార్టీలో చేర్చుకోండన్నా. ఏ పని చెయ్యటానికైనా నేను సిద్ధమే!" గంగులయ్య.

రాజప్ప కళ్ళకు గంగులయ్య చాలా ఎత్తు ఎదిగినట్లు అగుపించాడు. ఆనందంతో కౌగిలించు కున్నాడు. మరోసారి గంగులయ్యకు రెడ్ శాల్యూట్స్ చెప్పాడు.

గంగులయ్యను నిర్ణయాన్ని రాజప్ప సంతృప్తిగా అంగీకరించాడు . తాను అడగాలనుకున్న విషయాన్ని గంగులయ్యే చెప్పి ఆనంద పరిచాడు.

గంగులయ్య నిర్ణయాన్ని, రాజప్ప, పార్టీకి తెలియచేశాడు. పార్టీ వాళ్ళు ఆమోదించి మంచి కార్యకర్తగా తయారైనందుకు విప్లవాభివందనాలు తెలియచేస్తూ తాలూకా ఆర్గనైజరుగా బాధ్యత అప్పచెప్పారు.

* * * *

పార్టీ నిర్ణయాన్ని గంగులయ్యకు చెప్పడానికి, ఒకరోజు రాత్రి చాలా ప్రొద్దు పోయాక రాజప్ప రామిరెడ్డి పల్లె కొచ్చాడు.

గంగులయ్య పార్టీ యిచ్చిన బాధ్యతను ఆనందంగా స్వీకరించాడు.

తెల్లవారు జామునలేచి, రాజప్ప, గంగులయ్య ఇద్దరూ బయలుదేరారు. కాలిబాటన నడుచుకుంటూ రోడ్డెక్కేటప్పటికి ఆకాశంలో చీకటి మబ్బులా మటుమాయమౌతూ, తూరుపు కొండల్లోనుంచి సూర్యుడు ఎర్రగా నిప్పు కణికలాగా పుట్టుకొస్తున్నాడు.

ఆ పూర్లో మట్టిమనిషిలాగా బతికిన గంగులయ్య, రాడికల్స్ రాజకీయాలతో ఊరుతో పాటుగా, తానూ చైతన్య వంతుడై పోరాటంలో రాటుతేలి, వందలాది ఊర్లను తనవూరుగా, ప్రజలందరిని తనవాళ్ళుగా ఎంచుకోని, ఊరూరులోను ఎర్రజెండా ఎగురేయటానికి, "పోరాట సూర్యుడ్ని" వెలిగించటానికి, రాజప్పతో, కలసి తూర్పుదిశగా పోతున్నాడు.

# 'శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం' సమీక్షావ్యాసంలో కొన్ని సూత్రీకరణలు సరియైనవేనా ?

జీవన్

చైనాలో జరుగుతున్న పరిణామాలపై ఛార్లెస్ బెతల్‌హేం రాసిన వ్యాసాన్ని రంగనాయకమ్మగారు "చైనాలో ఏం జరుగుతోంది ?" అనే పేరిట అనువాదం చేసి, తమ వ్యాఖ్యానాలు కూడా కొన్ని కలిపి ప్రచురించారు. ఈ పుస్తకంపై సృజన, 1984 సెప్టెంబర్ సంచికలో కె. బాలగోపాల్ గారు రాసిన సమీక్షా వ్యాసంలో సాంస్కృతిక విప్లవానికి సంబంధించి కొన్ని సూత్రీకరణలు సరియైనవి కావని నేను భావిస్తున్నందున పాఠకుల దృష్టికి తీసుకురావడం భావ్యమని అభిప్రాయపడుతున్నాను.

1. సృజన, పే. 45-46ల్లో బాలగోపాల్ ఇలా చెప్పారు : "మావో తన 'క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్' లో పునాది ఆర్థిక సంబంధాలలో మూడు అంశాలు ఉంటాయని అంటాడు....ఉత్పత్తి సంబంధాలలో మావో చెప్పిన మూడవ అంశం పంపిణీ విధానం (distribution). సమాజం ఉత్పత్తి చేసే వివిధ పదార్థాలను ప్రజలందరికీ ఏ ప్రాతిపదిక మీద పంపకం చేయాలో నిర్ణయించే విధానం ఇది. అసలు ఏయే పదార్థాలు ఉత్పత్తి అవుతాయోగూడా పంపిణీ విధానమే కొంత మేరకు నిర్ణయిస్తుంది. నిజానికి పంపిణీ విధానం సామాజిక సంబంధాలలో చాలా కీలకమయినది. గ్రామాలకూ, పట్టణాలకూ మధ్య అసమానత, స్త్రీలకూ పురుషులకూ మధ్య అసమానత అన్నీగూడ పంపిణీ విధానంతో సన్నిహితంగా ముడిపడి వుండే సామాజిక సంబంధాలు — ఈ పంపిణీ విధానాన్ని నిర్ణయించే విషయాలు చాలా ఉంటాయి."

ఉత్పత్తి సంబంధాలలో కీలకమయినటువంటి లేదా అత్యంత ప్రధానమైన అంశం ఏమిటి ? బాలగోపాల్‌గారు చెప్పినట్టు పంపిణీ విధానం కాదు. ఉత్పత్తి చేయాలంటే ప్రజలు పరస్పరం కొన్ని సంబంధాలు ఏర్పరచుకోవాలి. ఉత్పత్తి క్రమంలో ప్రజలమధ్య ఏర్పడే ఈ సంబంధాలనే ఉత్పత్తి సంబంధాలంటారు. వర్గసమాజంలో ఈ సంబంధాలు అంతిమంగా వర్గసంబంధాలుగా ప్రతిబింబిస్తాయి. ఉత్పత్తి సంబంధాలలో మూడు అంశాలున్నాయి. 1. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్య విధానం. 2. ఉత్పత్తిలో ప్రజల పాత్ర, వారిమధ్య సంబంధాలు 3. ఉత్పత్తుల పంపిణీ విధానం.

ఉత్పత్తి సాధనాలు ఎవరి స్వంత ఆస్తి అనేదాన్నిబట్టి యాజమాన్యవిధానం తెలుస్తుంది. (యంత్రాలు, కర్మాగారాలు, భూమి వంటి శ్రమ సాధనాలు, ముడి పదార్థాలు వంటి శ్రమ లక్ష్యాలు ఇందులో ఉన్నాయి.) ఉత్పత్తి సాధనాలపై యజమాన్య విధానమే ఉత్పత్తి సంబంధాలలో అత్యంత ప్రధానమైన లేదా కీలకమైన అంశం. అదే ఉత్పత్తి సంబంధాలకు పునాది. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యమే ఉత్పత్తి సంబంధాల స్వభావాన్ని నిర్ణయిస్తుంది. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్య విధానాలలో ఉన్న తేడాల కనుగుణ్యంగానే మానవ సమాజాభివృద్ధిలో ఆదిమ సమాజం, బానిస సమాజం, ఫ్యూడల్ సమాజం, పెట్టుబడిదారీ సమాజం వర్గీకరించబడినాయి. యాజమాన్య విధానమే ఉత్పత్తిలో ప్రజల పాత్రనూ, వారి పరస్పర సంబంధాలనూ, తద్వారా ఉత్పత్తుల పంపిణీ విధానాన్నీ నిర్ణయిస్తుంది.

'గోథా కార్యక్రమం: పరిశీలన' గ్రంథంలో మార్క్స్ ఇలా చెప్పారు: "....పంపిణీ అనబడేదాన్ని గురించి ఇంత రాద్ధాంతం చేసి అదే ముఖ్యమన్నట్లు నొక్కి చెప్పడం, మొత్తంమీద అపసవ్యం. వినియోగ సాధనాలలో కొనసాగుతున్న పంపిణీ ఉత్పత్తి పరిస్థితుల పంపిణీకి ఫలితంగానే ఉంటుంది. అయితే ఉత్పత్తి పరిస్థితుల పంపిణీ అనేది ఉత్పత్తి విధానపు ఒక లక్షణంగా ఉంటుంది. ఉదాహరణకు, ఆస్తి రూపేణా, భూమి రూపేణా ఉత్పత్తికి సంబంధించిన భౌతిక పరిస్థితులు కార్మికులు కానివారి పరమై ఉండడం, ఉత్పత్తి తాలూకు వ్యక్తిగత పరిస్థితి, అంటే శ్రమశక్తి మాత్రం ప్రజాస్వామ్యం సొంతమై ఉండడం అనే వాస్తవంపైనే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఆధారపడి ఉంటుంది. ఉత్పత్తిలోని వివిధ అంశాలు (ఎలిమెంట్స్) ఇలా పంపిణీ అయి ఉన్నప్పుడు, వినియోగ సాధనాల పంపిణీ దాని సహజ ఫలితంగానే ఉంటుంది. ఉత్పత్తికి సంబంధించిన భౌతిక పరిస్థితులు కార్మికుల సహకారాత్మక ఆస్తి అయినప్పుడు వినియోగసాధనాల పంపిణీ నేటిలా గాక మరొక విధంగా రూపొందుతుంది. పంపిణీని ఉత్పత్తి విధానం నుంచి స్వతంత్రమైనదిగా పరిగణించడం, వ్యవహరించడం, అందువల్ల సోషలిజాన్ని ప్రధానంగా పంపిణీ మీద ఆధారపడేదిగా, చిత్రించడం వంటి ఆలోచనలను బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలనుంచి యాంత్రిక సోషలిస్టులు (వాళ్ళదగ్గరనుంచి ప్రజాస్వామిక వాదులలో ఒక పక్షం) చేపట్టారు. వాస్తవ

మైన సంబంధం ఎంతోకాలం కింద స్పష్టమయ్యాక, మళ్ళీ వెనక్కు పోవడమెందుకు?"
(పెకింగ్ ముద్రణ 1976. పే. 18)

ఏ పుస్తకం నుండి బాలగోపాల్ గారు మావో వివరణలు తీసుకున్నానని చెప్పారో, అదే పుస్తకంలో (క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్) మావో చెప్పింది బాలగోపాల్ చెప్పినదానికి పూర్తిగా భిన్నంగా ఉంది.

" "పంపిణీ విధానమే నిర్ణయాత్మకమైనది"—ఒక తప్పుడు అభిప్రాయం" అనే శీర్షిక కింద "....అయితే సోషలిస్టు ఉత్పత్తి అభివృద్ధి దిశను మౌలిక సోషలిస్టు ఆర్థిక నియమాలే నిర్ణయించినప్పుడు, వ్యక్తిగత భౌతిక ప్రయోజనం అనేది ఉత్పత్తికి నిర్ణయాత్మక భౌతికశక్తి ఎలా కాగలుగుతుందని ప్రశ్నించకుండా ఉండలేం. వినియోగ సరుకుల పంపిణీని నిర్ణయాత్మక చోదకశక్తిగా భావించడం - పంపిణీ నిర్ణయాత్మకమైనదనే తప్పుడు అభిప్రాయమే. 'పంపిణీ అంటే మొట్టమొదటి ఉత్పత్తి సాధనాల పంపిణీ కావాలి. ఉత్పత్తి సాధనాలు ఎవరి చేతుల్లో ఉన్నాయి? ఇదే నిర్ణయాత్మకమైన ప్రశ్న. వినియోగ సరుకుల పంపిణీని ఉత్పత్తి సాధనాల పంపిణీయే నిర్ణయిస్తుంది' అని మార్క్స్ 'గోథా కార్యక్రమం పరిశీలన' లో చెప్పారు. వినియోగ సరుకుల పంపిణీయే నిర్ణయాత్మక చోదక శక్తి అని భావించడం మార్క్స్ చెప్పిన సరైన అభిప్రాయాన్ని వక్రీకరించడమే అవుతుంది. అది చాలా తీవ్రమైన సైద్ధాంతిక పొరపాటు అవుతుంది" అని మావో అన్నారు. (పే. 78)

మార్క్స్, మావోలు చెప్పిన పై విషయాలను గమనించిన వారికెవరికయినా ఉత్పత్తి సంబంధాలలో పంపిణీ విధానం కాక ఉత్పత్తి సాధనాలపై యాజమాన్య స్వరూపమే కీలకమూ నిర్ణయాత్మకమూనని బోధపడుతుంది.

2. బాలగోపాల్ గారు 56వ పేజీలో ఇలా చెప్పారు: "ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు కలిసి సామాజిక ఆర్థిక పునాది. విప్లవం అనేది ఉత్పత్తి సంబంధాలను మార్చడంద్వారా ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి మార్గం సుగమం చేస్తుంది. ఇది మార్క్సిస్టులందరూ ఆమోదించే చారిత్రక భౌతికవాద సిద్ధాంతం. కాని దీన్ని వివరించడంలో రెండురకాల దృక్పథాలు ముందుకు వచ్చాయి. ఒకటి ఉత్పత్తి శక్తుల సిద్ధాంతం .... ఈ ఉత్పత్తిశక్తుల సిద్ధాంతానికి వ్యతిరేకంగా వచ్చింది 'ఉత్పత్తి సంబంధాల సిద్ధాంతం.' ఉత్పత్తి సంబంధాలు ఒక్కరోజులో మారిపోయి శాశ్వతమయిన రూపం తీసుకోవు. ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందేకొద్దీ ప్రతిదశలోనూ

ఉత్పత్తి సంబంధాలు మారతాయి. అంతేకాదు, ప్రతి దశలోనూ ఉత్పత్తి సంబంధాలను మార్చడం ద్వారానే ఉత్పత్తిశక్తుల నిరంతర పురోగమనం సాధ్యమవుతుంది. అంతే కాదు – ఉత్పత్తి సంబంధాలను, ఉపరితలాన్ని విప్లవీకరించక పోతే అది ఉత్పత్తి శక్తులమీద తిరిగి ప్రభావంవేసి వాటి అభివృద్ధిని ఆపేస్తుంది".

లీషావ్‌చీ వంటి రివిజనిస్టులు ముందుకు తెచ్చిన ఉత్పత్తిశక్తుల సిద్ధాంతానికి వ్యతిరేకంగా మావో వెలిబుచ్చిన అభిప్రాయాలను ఉత్పత్తి సంబంధాల సిద్ధాంతంగా కుదించడం సరికాదు.

మొదట, ఉత్పత్తి శక్తులూ, ఉత్పత్తి సంబంధాల విషయంలో మార్క్సిస్టు అవగాహన ఏమిటో చూద్దాం. తప్పనిసరిగా ఉత్పత్తి శక్తుల కనుగుణ్యంగానే ఉత్పత్తి సంబంధాలు ఉంటాయి. అలా అనుగుణ్యంగా లేని ఉత్పత్తి సంబంధాలు నిర్మూలించబడి వాటి స్థానే నూతన ఉత్పత్తి సంబంధాలు నెలకొల్పబడటం ద్వారానే ఉత్పత్తి శక్తులు అభివృద్ధి అవుతాయి. కాని పాత ఉత్పత్తి సంబంధాల వినాశనం, కొత్త ఉత్పత్తి సంబంధాలు రూపుదిద్దుకోవటం అనే క్రమం సాఫీగా జరిగేదికాదు. విప్లవాత్మక పోరాటాలతో మాత్రమే పాత ఉత్పత్తి సంబంధాల పరివర్తన గానీ, నూతన ఉత్పత్తి సంబంధాలను నెలకొల్పి పరిపూర్ణం చేయటంగానీ జరుగుతుంది. ఈ క్రమాన్ని ఆకళింపు చేసుకోవాలంటే ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య వైరుధ్యం అనే మాటల్లోనే వివరిస్తే సరిపోదు. ఉపరితలానికీ, ఆర్థిక పునాదికీ మధ్య సంబంధాలనుకూడా పరిశీలించాలి.

పైనా పరిణామాల విషయానికి వస్తే, "అభివృద్ధి చెందిన సామాజికవ్యవస్థకూ వెనకబడిన ఉత్పత్తిశక్తులకూ మధ్య వైరుధ్యమే సోషలిస్టు సమాజంలో ప్రధాన వైరుధ్య"మనే రూపంలో ఉత్పత్తి శక్తుల సిద్ధాంతాన్ని సి.పి.సి ఎనిమిదవ పార్టీ మహాసభ తీర్మానంలో లీషావ్‌చీ రివిజనిస్టు ముఠా చొప్పించింది. 1957లో మావో "ప్రజలమధ్య వైరుధ్యాలను పరిష్కరించడం" అనే వ్యాసంలో ఇలా చెప్పారు. "సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు ఏర్పడి ఉన్నాయి. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి అనుగుణంగా ఉన్నాయి. కాని ఇంకా పరిపూర్ణతకు దూరంగానే ఉంటాయి. ఈ అపరిపూర్ణత ఉత్పత్తి శక్తుల పెరుగుదలలో, వైరుధ్యంలో ఉంది. ఉత్పత్తి సంబంధాలకూ, ఉత్పత్తి శక్తులకూ

మధ్య ఒద్దికతో పాటు వైరుధ్యం కూడా ఉంది. దీనిని అటుంచి, ఉపరితల నిర్మాణానికీ, ఆర్థిక పునాదికీ మధ్య వొద్దికతోబాటు వైరుధ్యం కూడా ఉంది...."

"వర్గపోరాటం పూర్తికానేలేదు. శ్రామిక వర్గానికీ, బూర్జువా వర్గానికి మధ్య వర్గపోరాటం, భిన్న రాజకీయశక్తుల మధ్య పోరాటం, భావరంగంలో శ్రామికవర్గానికీ, బూర్జువా వర్గానికీ మధ్య వర్గపోరాటం సుదీర్ఘం గానూ, ఆటుపోట్లతోనూ కొనసాగుతుంది. కొన్ని కొన్ని సందర్భాలలో అవి అతి తీవ్రం అవుతుంది కూడా శ్రామిక వర్గం తన స్వీయ ప్రాపంచిక దృక్పథానికి అనువుగా పరివర్తన చెందింప జూస్తుంది. బూర్జువా వర్గం కూడా అంతే. ఈ విషయంలో సోషలిజం గెలుస్తుందా లేక పెట్టుబడిదారీ విధానం గెలుస్తుందా అనే సమస్య ఇంకా నిజంగా పరిష్కారం కాలేదు".

మావో ఇలా చెపితే, 1956 లో చైనాలో వర్గాలే లేవు గనుక వర్గపోరాటానికి గానీ, దాని ప్రతిబింబంగా పార్టీలో రెండు పంథాల మధ్య పోరాటానికి గానీ ఆస్కారం ఎంతమాత్రం లేదనీ, ఉత్పత్తి శక్తుల సమున్నతాభివృద్ధి స్థాయి తనంతతానే సోషలిజానికీ, కమ్యూనిజానికీ దారి తీస్తుందనీ లీషావ్ చీ వాదించాడు.

ఆ తర్వాత ఐదు సంవత్సరాల్లో పై విషయాలపై రెండు పంథాల మధ్య కొనసాగుతూ వచ్చిన ఆంతరంగిక పోరాటం ఆచరణలోనూ, సిద్ధాంత రంగంలోనూ కూడా మరింత తీవ్రతరమయింది. 1962 లో పార్టీలో సమైక్యత సాధించడానికి వీలుగా 8వ పార్టీ కాంగ్రెస్ 10వ ప్లీనరీ సమావేశంలో మావో సోషలిస్టు సమాజ కాలానికంతటికీ మౌలిక పంథాను రూపొందించాడు. ఆ నాటి నుండి మావో మరణం వరకు చైనా కమ్యూనిస్టు పార్టీకి అది మార్గదర్శకంగా ఉంది. "సోషలిస్టు సమాజం గణనీయంగా, చారిత్రకంగా చాల దీర్ఘకాలం తీసుకుంటుంది. ఈ దీర్ఘకాల సోషలిస్టు చారిత్రకదశ అంతటి లోనూ వర్గాలు, వర్గ వైరుధ్యాలు, వర్గపోరాటం, పెట్టుబడిదారీ పంథాకు, సోషలిస్టు పంథాకు మధ్య ఘర్షణ, పెట్టుబడిదారీ పునరుద్ధరణ ప్రమాదం ఉంటాయి. ఇంకా మిగిలి ఉండే ఈ పోరాటపు సంక్లిష్ట స్వభావం మనం తప్పనిసరిగా గుర్తించాలి. మనం నిరంతరం అప్రమత్తంగా ఉండాలి. సోషలిస్టు ప్రచారాన్ని తప్పక చేపట్టాలి. ఆ వర్గ వైరుధ్యాలను, పోరాటాలను మనం స్పష్టంగా అర్థం చేసుకుని పరిష్కరించాలి. లేకపోతే మనలాంటి సోషలిస్టు సమాజం ఏదైనా తిరోగమించ గలదు. నాశనం గావించబడగలదు. పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరించబడగలదు. ఇక ముందు నుండి, మనం ప్రతి సంవత్సరం, ప్రతినెల, ప్రతిరోజు గుర్తుంచుకోవడం ద్వారానే ఈ సమస్యల పట్ల ఒక స్థిరమైన అవగాహననూ, మార్క్సిస్టు - లెనినిస్టు విధానాన్నీ కలిగి ఉంటాము" అని ఆ పంథా చెప్పింది.

కార్మికవర్గం అధికారాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత కూడా, అంతిమంగా

సోషలిజం గెలుస్తుందా, పెట్టుబడిదారీ విధానం గెలుస్తుందా అనే ప్రశ్న తేలడానికి ముందు కార్మిక వర్గానికి, బూర్జువా వర్గానికి మధ్య వివిధ రంగాలలో జరిగే పోరాటం చాల తీవ్ర స్థాయికి చేరుతుందని 1956 లో చెప్పిన మావో, ఆ తర్వాత లభించిన అనుభవాన్ని పురస్కరించుకొని "కార్మిక వర్గ నియంతృత్వాన్ని సంఘటిత పరచు కోవడానికి, సోషలిజం నిర్మించడానికి, ఈ అనువైన సమయంలోనే ప్రస్తుతం మహత్తర సాంస్కృతిక విప్లవం అవసరమని" చెప్పాడు. ఈ వాక్యాలు సోషలిస్టు విప్లవం కొనసాగుతున్న దశలో అది అంతిమ విజయాన్ని సాధించేలోగా పెట్టుబడి దారీ వర్గానికీ, కార్మికవర్గానికీ మధ్య సాగే సంఘర్షణ కొన్ని సందర్భాలలో కార్మిక వర్గ నాయకత్వం కింద తదితర విప్లవ ప్రజానీకాన్నీ ఆధారం చేసుకుని మరో విప్లవం కొనసాగించాల్సిన అవసరం తప్పనిసరిగా ఏర్పడుతుందనే భావాన్ని వ్యక్తం చేస్తున్నాయి. అందుకే కార్మికవర్గ నాయకత్వం కింద సోషలిజానికి అంతిమవిజయం చేకూరే వరకూ విప్లవాన్ని నిర్విరామంగా కొనసాగించాలనీ, రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకుని, ఉత్పత్తి సాధనాలను స్వాధీనపరచుకున్న తర్వాత రాజకీయ, సైద్ధాంతిక రంగాల్లో సోషలిస్టు విప్లవాన్ని తీసుకురావాలనీ మావో సూత్రీకరించాడు. అలా లీషావ్‌చీ ప్రతిపాదించినటువంటి అభివృద్ధినిరోధకమైన ఉత్పత్తిశక్తుల సిద్ధాంతం లేదా ఉత్పాదకతకే ప్రాధాన్యత అనే దృక్పథానికి గొడ్డలి పెట్టుగా కార్మిక నియంతృత్వం కింద విప్లవాన్ని కొనసాగించాలనే సిద్ధాంతాన్నీ, సోషలిస్టు దశ అంతటి లోనూ పార్టీ అనుసరించాల్సిన సాధారణ పంథానూ మావో రూపొందించాడు.

ఉత్పత్తి శక్తుల సిద్ధాంతానికి భిన్నంగా మావో నాయకత్వంలో చైనా కమ్యూనిస్టు పార్టీ చేసిన సిద్ధాంతీకరణలను ఉత్పత్తి సంబంధాల సిద్ధాంతంగా కుదించడం మంటే, ఉపరితలంలో తీసుకురావలసిన విప్లవాత్మక మార్పులను విస్మరించడమే అవుతుంది. ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు ; ఉత్పత్తి సంబంధాలు, ఉపరితలం ; వీటి మధ్య సంబంధాలు అంటూనే మావో ప్రస్తావిస్తూ వచ్చాడు. అంతే కాదు, చైనా కమ్యూనిస్టు పార్టీ అధికారిక డాక్యుమెంట్లలో ఎక్కడ కూడా ఉత్పత్తి సంబంధాల సిద్ధాంతం అనే సూత్రీకరణ లేదు. "ఉత్పత్తి సంబంధాలనూ, ఉపరితలాన్ని విప్లవీకరించకపోతే అది ఉత్పత్తి శక్తులమీద తిరిగి ప్రభావం వేసి వాటి అభివృద్ధిని ఆపేస్తుంది" అని బాలగోపాల్ సరిగానే వివరించగలిగినప్పటికీ, ఉత్పత్తి శక్తుల సిద్ధాంతానికి భిన్నంగా తలెత్తింది ఉత్పత్తిసంబంధాల సిద్ధాంతమంటూ తప్పుడు సూత్రీకరణ చేశారనే చెప్పాలి.

3. 49వ పేజీలో బాలగోపాల్ ఇలా చెప్పారు: "సాంస్కృతిక విప్లవం ముట్టుకోని ముఖ్యమైన ఆర్థిక సంబంధాలు రెండున్నాయి. ఒకటి సరుకుల ఉత్పత్తి (Commodity Production). రెండవది పునరుత్పత్తి క్రమం (process of re-

production). ఇవి రెండూ గూడా ఒకంతట పరిష్కారమయ్యే సమస్యలు కావు కాబట్టి వీటిని సాంస్కృతిక విప్లవం పట్టించుకోకపోవటంలో వింతలేదు".

సరకుల ఉత్పత్తి, పునరుత్పత్తి క్రమాలను సాంస్కృతిక విప్లవం పట్టించుకోలేదనడం సరికాదు. సాంస్కృతిక విప్లవం ప్రధానంగా ఉపరితలంలో చెలరేగినప్పటికీ, ఉపరితలంలో వచ్చే మార్పులు పునాదిని ప్రభావితం చేయకుండా ఉంటాయా? ఉండవనే మార్క్సిజం చెపుతుంది. సమాజ తాత్విక జీవితం సమాజ భౌతిక జీవిత పరిస్థితుల ప్రతిబింబమే. అయితే సామాజిక భావాలు, సిద్ధాంతాలు, దృక్పథాలు, రాజకీయ వ్యవస్థల ప్రాముఖ్యతనూ, చరిత్రలో వాటి పాత్రనూ చారిత్రక భౌతిక వాదం తిరస్కరించదు. పైగా సామాజిక జీవితంలో, చరిత్రలో ఈ అంశాల ప్రాధాన్యతనూ, ప్రముఖపాత్రనూ నొక్కి చెపుతుంది.

ఒక సమాజంలో ఆనాడుండే ఉత్పత్తి సంబంధాల మొత్తమే ఆ సమాజం యొక్క పునాది. సమాజ పునాదిననుసరించే దాని ఉపరితలం నిర్మాణమయి అభివృద్ధి చెందుతుంది. సమాజంలోని రాజకీయ, తాత్విక, న్యాయశాస్త్ర సంబంధమైన అభిప్రాయాలూ, కళలు, మతం మొదలైన వాటికి సంబంధించిన అభిప్రాయాలూ, వాటిననుసరించి నిర్మాణమయిన సంస్థలు — దీనినే ఉపరితలం అని అంటాం. ఆర్థిక పునాది, దానిననుసరించి నిర్మితమైన ఉపరితలం కలిసి సాంఘిక — ఆర్థిక వ్యవస్థ (socio-economic formation) రూపొందుతుంది. పునాది ఉపరితలాన్ని నిర్ణయిస్తే ఉపరితలం పునాదిని ప్రభావితం చేస్తుంది. ఆర్థిక పునాది అభివృద్ధి చెందుతూ మార్పులకు గురవుతున్న కొద్దీ ఉపరితలం త్వరగానో ఆలస్యంగానో తప్పనిసరిగా మార్పులకు లోనవుతుంది. సాపేక్షికంగా స్వతంత్రంగా ఉండి, ఆర్థిక పునాదిని ప్రభావితం చేసే ఉపరితలం, ఆర్థిక పునాది అభివృద్ధి మార్పులకు గురవుతున్న నిర్దిష్ట పరిస్థితులలో నిర్ణయాత్మక పాత్రనే వహిస్తుంది.

అందుకే, కార్మిక వర్గ నియంతృత్వం అమలులో ఉండగా ఆ నియంతృత్వానికి, అమలులో ఉన్న సోషలిస్టు ఆర్థిక విధానాన్ని కమ్యూనిస్టు సమాజ నిర్మాణం వైపు పురోగమింప జేయడానికి అనువుగా ఉపరితలంలో కూడా విప్లవం తేవడం.

ఉపరితలంలో కూడా విప్లవం తీసుకొని రావడం ద్వారా సాధ్యమైనంత త్వరలో ఆ దేశంలో కమ్యూనిజాన్ని సాధించడానికి, ప్రపంచ విప్లవాన్ని సాధ్యమైనంత త్వరలో జయప్రదం చేయడానికీ, విముక్తి ప్రాంతంగా తన కర్తవ్యాన్ని నిర్వహించడానికి కార్మికవర్గ నియంతృత్వాన్ని బలమైన ఆయుధంగా నిర్మించడం.

రద్దు చేయబడిన వర్గాలు తిరిగి తలెత్తడానికి గల అవకాశాలను సమూలంగా నిర్మూలించి, పెట్టుబడిదారి పునరుద్ధరణకై అవి చేసే కలలను, తలపెట్టే ప్రయత్నాలను వమ్ము చేయడానికి కార్మికవర్గ నియంతృత్వం ఆధ్వర్యంలో నిరవధిక విప్లవాన్ని

కొనసాగించడం- సాంస్కృతిక విప్లవం ధ్యేయాలుగా రూపొందాయి.

అందువల్ల సోషలిస్టు ఆర్థిక విధానాన్ని కమ్యూనిస్టు సమాజ నిర్మాణంవైపు పురోగమింప జేయడం సాంస్కృతిక విప్లవానికి సంబంధించిన లక్ష్యమని గుర్తించుకోవాలి. అయితే ఈ పురోగమనాన్ని సరుకు ఉత్పత్తి విధానంలోనూ, సరుకుల మారకంలోనూ, వాటిని నిర్దేశించే విలువ నిర్ణయ సూత్రంలోనూ మార్పులు తేకుండా సాధించగలమా ? మార్పులు రావటమే కాదు, కమ్యూనిస్టు సమాజంలో (higher phase of Communism) సరుకు ఉత్పత్తి విధానమే అదృశ్యమై పోతుంది. పెట్టుబడిదారీ విధానానికీ, కమ్యూనిజానికీ, మధ్య పరివర్తన దశ అయిన సోషలిస్టు సమాజంలో సరుకు ఆర్థిక విధానం ఉంటుంది గనుక, దీన్ని ఉపయోగించుకోవటం, పరిమితం చేయటం, అంతిమంగా పరివర్తన చేయటం లక్ష్యంగా ఈ దశలో పార్టీ కృషీ, ప్రజల కృషీ ఉండాలి.

సరుకు ఉత్పత్తి విధానం పట్ల ఈ మార్క్సిస్టు అవగాహనతోపాటు సాంస్కృతిక విప్లవ కాలంలో చైనాలో జరిగిన పరిణామాలేమిటో చూద్దాం. సరుకుల ఉత్పత్తి అంటే స్వంత ఉపయోగానికి కాక అమ్మకం కొరకు, మార్కెట్‌లో మారకం కొరకు వస్తువులను ఉత్పత్తి చేయడం. ఆదిమ సమాజం శిథిలమవుతున్న దశలో సరుకుల ఉత్పత్తి ప్రారంభమైంది. బానిస, ఫ్యూడల్ ఉత్పత్తి విధానాలలో కొనసాగింది. పెట్టుబడిదారి సమాజంలో సరుకుల ఉత్పత్తి అగ్రస్థానాన్ని పొంది, సర్వవ్యాపిత స్వభావాన్ని సంతరించుకుంది. ఈ సమాజంలో ప్రజలమధ్య సంబంధాలు వస్తువుల మధ్య సంబంధాలుగా, అంటే సరుకులమధ్య సంబంధాలుగా ప్రదర్శితమవుతాయి. కొన్ని నిర్దిష్ట పరిస్థితులున్నప్పుడే సరుకుల ఉత్పత్తి తలెత్తగలుగుతుంది. సరుకుల ఉత్పత్తి ప్రారంభ మనగలగాలంటే సామాజిక శ్రమవిభజన జరగడం అవసరం. కాని ఇది సరుకుల ఉత్పత్తి కొనసాగేందుకు ఒక పరిస్థితి మాత్రమే, అందుకు మరొక పరిస్థితికూడా ముఖ్యం సమాజంలో ఉన్న ఉత్పత్తి సాధనాలపైన పెత్తనంగల వివిధ రకాల యజమానులు కూడా ఉండాలి. ఈ రెండు పరిస్థితులూ ఉన్ననాడే అమ్మకం, కొనుగోలుల రూపంలో సరుకుల ఉత్పత్తి, మారకం తలెత్తగలుగుతాయి. పెట్టుబడిదారి సరుకు ఉత్పత్తికి అదనంగా శ్రమశక్తి సరుకుగా మారే పరిస్థితికూడా తోడు కావాలి. లెనిన్ ఇలా అన్నాడు : "సరుకుల మారకం బూర్జువా సమాజంలో అతి సరళమైన, అతి సామాన్యమైన, అతి ప్రాథమికమైన, అతి విస్తృతమైన దైనందిన సంబంధం. లక్షల, కోట్ల పర్యాయం మనకెదురయ్యే సంబంధం అది".

విలువనిర్ణయ సూత్రం సరుకుల ఉత్పత్తిని నిర్దేశించే ఆర్థికసూత్రం. స్వంత యాజమాన్యం పునాదిగా గల సమాజంలో ఉత్పత్తిని క్రమబద్ధం చేసేది విలువనిర్ణయ సూత్రం. ఈ సూత్రం ప్రకారమే సరుకుల మధ్య మారకం, వాటిని తయారు చేయ డానికి వెచ్చించబడిన సామాజిక అవసర శ్రమ బట్టి జరుగుతుంది. మరొక విధంగా చెప్పాలంటే విలువ నిర్ణయసూత్రం అర్థం సరుకులు పరస్పరం వాటి విలువను బట్టి మారకం చేయబడతాయనేదే. అంటే ఒకదానితో ఒకటి మారకం చేయబడిన సరుకులలో సమానమైన సామాజిక అవసరశ్రమ మొత్తం ఉంటుంది. అంటే అవి ఆ ప్రమాణా లలో సరిసమానమైనవన్నమాట.

సోషలిజంలో సరుకు—ద్రవ్య సంబంధాలలోని విషయం కొత్తదిగా ఉంటుంది. పెట్టుబడిదారీ విధానంలో వలె సోషలిజంలో సరుకుల ఉత్పత్తి సార్వత్రికం కాదు. సోషలిజంలో సరుకుల ఉత్పత్తి, సరుకుల చలామణీ పనిచేసే రంగం పరిమితంగా ఉంటాయి. సోషలిజంలో రెండురకాల ఆస్తి అంటే సమష్టి ఆస్తి, ప్రజలందరి ఆస్తి వుంటాయి. కనుకనే సరుకుల ఉత్పత్తి మారకానికి ఆస్కారం ఏర్పడుతుంది. ఒక కమ్యూన్‌కూ, వేరొక కమ్యూన్‌కూమధ్య; కమ్యూన్లకూ, ప్రభుత్వ అజమాయిషీలోని వ్యాపార సంస్థలకూ మధ్య ఉత్పత్తుల మారకం జరుగుతుంది. అది సరుకు రూపమే దాల్చుతుంది.

'గోథాకార్యక్రమం : పరిశీలన' గ్రంథంలో మార్క్స్ ఇలా అన్నారు: "తన సొంత పునాదులపై పైకిలేచినట్టుగా కాక, దీనికి భిన్నంగా పెట్టుబడిదారీ సమాజం నుండి బయట పడుతున్నట్టుగా ఉండే కమ్యూనిస్టు సమాజంతోటి మనం ఇక్కడ వ్యవహరించ వలసి ఉంది; ఇందుచేత ఆర్థికంగానూ, నైతికంగానూ, బుద్ధిపరంగానూ ప్రతి విష యంలో కూడానూ ఏ సమాజ గర్భంనుండి తాను బయట పడుతున్నదో ఆ పాత సమాజపు పుట్టుమచ్చలూ, గుర్తులూ (birth marks) అచ్చు గుద్దినట్టుగా ఉన్న సమాజం ఇది. వ్యక్తిగా ఉత్పత్తిదారుడు సమాజానికి దేనినైతే సమర్పించాడో దాన్నే- తీసివేతల తర్వాత—సమాజం నుండి స్వీకరించడం తత్ఫలితంగానే .... .... సరుకుల మార్పిడి సమానమైన విలువల మార్పిడి అయేటంత మేరకు, సరుకు మార్పిడిని ఏ సూత్రమైతే పాలిస్తుందో అదే ఇక్కడ అమలుజరుగుతుంది. కాకుంటే, దానిరూపమూ, విషయమూ ఇప్పుడు మార్పు చెందుతాయి. ఎందువల్లనంటే, మారిన ఈ పరిస్థితుల్లో ఒకడు తన శ్రమను తప్ప మరిదేన్నీ ఇవ్వలేడు; అలాగే, మరోవైపున, వ్యక్తిగత మైన వినియోగ అవసరాలు తప్ప తక్కినదేవీ వ్యక్తులకు సొంతం కాజాలవుగదా! అయితే వినియోగ సాధనాలను వ్యక్తిగత ఉత్పత్తిదారులకు పంచడానికి సంబంధించి నంతవరకు, సమాన సరుకుల మార్పిడి విషయంలో పనిచేసే సూత్రమే పనిచేస్తుంది. ఒక రూపంలో ఉన్న కొంతశ్రమ, మరొక రూపంలోవున్న సమాన శ్రమ మొత్తానికి మార్పిడి అవుతుందన్న మాట.

అందుచేత సూత్రానికీ అమలుకూ మధ్య మరేమాత్రమూ సంఘర్షణ లేకపోయి నప్పటికీ, సూత్రాన్ని బట్టి చూస్తే మాత్రం సమమైన హక్కు ఇంకా ఇక్కడ బూర్జువా హక్కుగానే ఉంటుంది. సరుకుల మార్పిడిలో సమానమొత్తాల మార్పిడి, సగటుమీద మట్టుకేగాని విడి విడి సందర్భాలలో జరగదు ...."

"వ్యక్తులు శ్రమ విభజనకు బానిసలైన పరాధీనతతో బాటుగా, మానసిక, శారీరక శ్రమల మధ్యగల వైరుధ్యం కూడా అదృశ్యమై, శ్రమ అనేది కేవలం బతుకు తెరువుగాకాక ప్రధాన జీవితాదర్శంగా మారినప్పుడు, వ్యక్తి సర్వతోముఖాభివృద్ధితో పాటుగా ఉత్పత్తి శక్తులు కూడా ఇతోధికంగా పెరిగినప్పుడు, సహకారాత్మక సంపద సెలయేళ్ళన్నీ పుష్కలంగా ప్రవహించినప్పుడు, అంటే కమ్యూనిస్టు సమాజ ఉన్నత దశలో మాత్రమే బూర్జువా హక్కు అనే సంకుచిత సీమాంతరాన్ని పూర్తిగా దాటి, 'ఎవరి శక్తిని బట్టి వారినుండి, ఎవరి అవసరాన్ని బట్టి వారికి' అనే మాటలను సమాజం తన పతాకంమీద లిఖించుకోగలదు".

సోషలిస్టు సమాజంలో 'శ్రమకు తగిన ప్రతిఫలం' అనే సూత్రం అమలులో సమాన సరుకుల మార్పిడి సూత్రమే పని చేస్తుందని మార్క్స్ ఈ పుస్తకంలో స్పష్టం చేశాడు. దానిని ఆయన బూర్జువా హక్కుగానే గుర్తించాడు.

అందువల్ల సోషలిస్టుదశలో సరుకులమార్పిడి, బూర్జువా హక్కు వుంటాయి. ఈ అంశాన్నే వివరిస్తూ "బూర్జువా హక్కు ఉత్పత్తి సాధనాలను వ్యక్తుల స్వంత ఆస్తిగా గుర్తిస్తుంది. సోషలిజం వాటిని ఉమ్మడి ఆస్తిగా మారుస్తుంది. ఆ మేరకు, కేవలం ఆ మేరకు మాత్రమే, బూర్జువా హక్కు అదృశ్యమవుతుంది" అనీ, అది "చేసిన శ్రమ మొత్తానికనుగుణంగా ఉత్పత్తుల విభజన కొనసాగినంతకాలం అస్తిత్వంలో ఉంటుంది" అనీ లెనిన్ 'రాజ్యాంగయంత్రం, విప్లవం'లో అన్నారు.

బూర్జువా హక్కును పరిమితం చేయటమంటే సరుకుల ఉత్పత్తి విధానాన్నీ, సరుకుల మారకాన్నీ నిర్దేశించే విలువ నిర్ణయ సూత్రాన్ని పరిమితం చేయటమే. పెట్టుబడిదారీ అంశం అయిన సరుకును పరిమితం చేయటమే.

సోషలిస్టువ్యవస్థ అప్పుడప్పుడే పెట్టుబడిదారీ వ్యవస్థ గర్భంనుండి తలెత్తింది గనుక, పెట్టుబడిదారీ అవశేషాలుండనే ఉంటాయి. సోషలిస్టు విప్లవ, నిర్మాణ సుదీర్ఘ క్రమంలో వాటిని క్రమ క్రమంగా నిర్మూలించాల్సి వుంటుంది. 'పనికి తగిన ప్రతిఫలం' అనే సూత్రం సోషలిస్టు చారిత్రక దశలోకూడా పాత్ర కలిగివుంటుంది. కనుక దానిని అమలుచేయాల్సి ఉంటుంది. కాని, ఈ సూత్రం కమ్యూనిస్టు సూత్రం కాదనీ, భవిష్యత్తులో అది రూపు మాసిపోతుందనీ మనం గుర్తుంచుకోవాలి. కార్మికవర్గపు అంతిమ లక్ష్యం కమ్యూనిస్టు సమాజాన్ని స్థాపించటమే. ఆ సమాజంలో "శక్తి సామర్థ్యాలను బట్టి ప్రతి ఒక్కరూ పనిచేయటం, అవసరాలను బట్టి అనుభవించటం" అనే

సూత్రం అన్వయించబడుతుంది. ఈ లక్ష్యం సాధించబడక ముందు బూర్జువాహక్కు తప్పనిసరిగా పంపిణీలోనూ, ద్రవ్యం ద్వారా మారకంలోనూ ఉంటుంది. అంతేగాక కార్మికులకూ, రైతాంగానికీ మధ్య, పట్టణాలకూ పల్లెలకూ మధ్య, మానసిక శ్రమకూ శారీరకశ్రమకూ మధ్య యింకా విభేదాలు ఉండనే వుంటాయి. ఈ అంశాలు అస్తిత్వంలో ఉన్నంతకాలమూ పెట్టుబడిదారీ విధానమూ, రివిజనిజమూ తలెత్తటానికి అవి భూమికగానే పనిచేస్తాయి.

లెనిన్ సూచించినట్టు "బూర్జువాజీ అస్తిత్వాన్ని కలిగివుండటం లేదా నూతన బూర్జువా వర్గం తలెత్తటం అసంభవమయ్యేటటువంటి పరిస్థితులు సృష్టించాలంటే, కూలదోయబడిన దోపిడీవర్గాల ప్రతిఘటనను అణచివేయటం, బాహ్య శత్రువులు తలపెట్టే విచ్ఛిన్నకర చర్యలు, దురాక్రమణల నుండి పరిరక్షించుకోవటం. నూతనంగా తలెత్తే బూర్జువా శక్తులకు, ధోరణులకు, బూర్జువా జీవితశైలికి వ్యతిరేకంగా పోరాడటం — వీటితో మాత్రమే సరిపుచ్చుకోవటం గాక, కార్మికవర్గ నియంతృత్వం కింద బూర్జువా హక్కులో ఏ భాగమయితే యింకా ఉనికిలో ఉందో, దానిని పరిమితం కూడా చేయాలి".

బూర్జువా హక్కును క్రమక్రమంగా పరిమితం చేయటం, కార్మికవర్గ నియంతృత్వం కింద బూర్జువాహక్కు అనే అవగాహననే విడనాడటమా లేక ఆ హక్కును విస్తృతం చేయటం కొనసాగించాలా — అనే సమస్య కార్మికవర్గానికీ బూర్జువా వర్గానికీ మధ్య, మార్క్సిజానికీ రివిజనిజానికి మధ్య జరిగిన పోరాటంలో ఒక ప్రధానమైన అంశంగానే చైనాకమ్యూనిస్టుపార్టీ విప్లవాచరణలో రూపొందింది. మహత్తర శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవకాలంలో మావో అనుసరించిన సరైన మార్క్సిస్టు — లెనినిస్టు పంథాకూ, లీ షావ్ చీ రివిజనిస్టు పంథాకూ మధ్య జరిగిన పోరాటంలో ఈ అంశంకూడా ప్రతిబింబించింది. మావో నాయకత్వాన చైనా కమ్యూనిస్టుపార్టీ పలు విప్లవాత్మక చర్యలను చేపట్టింది. విప్లవాత్మక నూతన విషయాలను దృఢంగా సమర్థించింది. వేతనాలలో విభేదాలను తగ్గించటం; కేడర్లు, రైతులు, కార్మికులు, సైనికులు, విద్యార్థులు, వాణిజ్యసంస్థలలో పనిచేసే కార్మికులు మే 7 మార్గాన్ని దృఢంగా చేపట్టటం; కేడర్లు ఉమ్మడి ఉత్పాదక శ్రమలో పాల్గొనటం; గ్రామీణ ప్రాంతాలలో స్థిరపడటానికి చదువుకున్న యువకులు అక్కడికి వెళ్ళటం; మార్క్సిస్టు సిద్ధాంత బృందాల [కంటింజెంట్‌ల]లో కార్మికులు, రైతులు, సైనికులు చేరటం మొదలయినవన్నీ విప్లవాత్మక నూతన విషయాలుగా చైనా కమ్యూనిస్టుపార్టీ పేర్కొంది. ఇవన్నీ - మూడు పెద్ద విభేదాలను క్రమ క్రమంగా తొలగించటంలోనూ, బూర్జువా హక్కును పరిమితం చేయటంలోనూ, కార్మికవర్గ నియంతృత్వాన్ని సంఘటిత పరచ

టంలోనూ, పెట్టుబడిదారీ పునరుద్ధరణను నిరోధించటం లోనూ, కార్మికవర్గ నియం తృత్వం కింద విప్లవాన్ని కొనసాగించటం లోనూ, అత్యంత ప్రాధాన్యతను కలిగి ఉన్నాయని చైనా పార్టీ వివరించింది.

అందువల్ల పాత సమాజంనుండి వచ్చిన అవశేషాలను, ఉదాహరణకు వేతనా లలో విభేదాలు మొదలయిన వాటిని తొలగించటానికి చైనా కమ్యూనిస్టుపార్టీ కృషి చేసిందనీ, ఆ దిశలో కొన్ని చర్యలుకూడా చేపట్టిందనీ స్పష్టమవుతుంది. వేతనాలలో విభేదాలను తగ్గించడంవంటి చర్యలు సమాన సరుకుల మార్పిడిని, బూర్జువాహక్కును పరిమితం చేసే లక్ష్యంతోనే చేపట్టబడినాయి.

ఇకపోతే కమ్యూన్లలో జరిగిన పరిణామాల విషయానికి వస్తే కమ్యూన్లు బూర్జువా హక్కు అస్తిత్వాన్ని గుర్తించి దాన్ని పరిమితం చేయటానికి కృషిచేశాయి. ఈ క్రమంలో కమ్యూనిస్టు నూతన అంశాలుకూడా ఏర్పడ్డాయి. ఇవన్నీ సరుకు ఉత్పత్తి విధానాన్నీ బూర్జువా హక్కునూ పరిమితంచేసే లక్ష్యంతో పెంపొందించిన ఎడ్యుకేషన్, చైతన్యం ఫలితంగానే పెంపొందాయి. సాంస్కృతిక విప్లవకాలంలో ప్రజల భావాలు, దృక్పథాలు, సిద్ధాంతాలలో మార్పు తీసుకురావటం మూలంగానే ఇవి సంభవించాయి. కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై కమ్యూన్ సభ్యులలో పెంపొం దిన చైతన్యానికే ఇవి నిదర్శనాలు. మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం యొక్క మౌలికసిద్ధాంత కార్యక్రమం-'స్వార్థానికి వ్యతిరేకంగాపోరాడి, రివిజనిజాన్ని విమర్శించడం' అనే విషయాన్ని ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. తమవ్యక్తిగత భౌతిక అవసరాల కోసమే గాక మొత్తం సమాజాభివృద్ధికీ, కమ్యూనిస్టు సమాజాన్ని సాధించడానికీ, ప్రపంచ విప్లవాన్ని పురోగమింపజేయడానికీ ఉత్పత్తిని ఇతోధికంగా పెంచాల్సిన అవసరాన్ని చైనాప్రజలు సాంస్కృతిక విప్లవకాలంలో గుర్తించారు. "విప్లవాన్ని అవగతం చేసుకొండి. ఉత్పత్తిని పెంచండి" అనే నినాదం సాంస్కృతిక విప్లవం ఒకదశలో చైనా అంతటా మారుమోగింది.

తాచాయ్ బ్రిగేడ్‌ను ఉదాహరణగా తీసుకుంటే, సోషలిస్టు పరిస్థితిలో, పంపిణీలో బూర్జువా హక్కును గుర్తించి, దాన్ని పరిమితం చేసే దిశలో అది అడుగులు వేసింది. బ్రిగేడ్‌లో సభ్యులందరూ తమ పూర్తి శక్తి సామర్థ్యాలను వినియోగించి పని చేసే వారు. 'వర్క్ పాయింట్లు' న్యాయంగా నిర్ణయింపబడేవి. ఆదాయాలలో తేడాలున్నా అవి అంత పెద్ద తేడాలుకావు. పని చేయగలిగిన ప్రతివారూ, తక్కువ పని చేయ గలిగినా, ఎక్కువ పని చేయగలిగినా తమ సంపాదన పైననే బతకగలిగేవారు. ఇక ఏ కుటుంబానికీ తన వంతుకు మించి సమష్టి సంస్థల డబ్బు నుండి ఎక్కువగా తీసుకోవటంగానీ, సమష్టి సంస్థలకు అప్పుల్లో పడడంగానీ అవసరం లేకుండా పోయింది. ఇటువంటి రుణాలు, అప్పుల మూలంగా నిధులు ఖర్చయి పోయి, సంవత్స

రం ఆఖరున పంపిణీలో తమవంతు భాగాన్ని పొందలేని కుటుంబాలు ఉండేవి కావు. ఇప్పుడు ప్రతి ఒక్కరూ సమష్టి సంస్థల సంవత్సరాదాయంలో తనకు రావలసిన న్యాయమైన భాగాన్ని పొందగలిగే వారు. సోషలిస్టు విధానం యొక్క ఉత్తమ గుణాన్నీ, శ్రేష్టతనూ ఇది స్పష్టంగా నిరూపిస్తుంది. వర్క్ పాయింట్లు గాక, రాజకీయాలే ఆధిపత్యం వహించాలి అనే విధానాన్ని అనుసరించటం మూలంగానే ఈ ఫలితాలు వచ్చాయనేది గమనించాల్సిన విషయం. తాచాయ్‌లో మొదట "ప్రమాణంగా తీసుకున్న వ్యక్తి పని ప్రాతిపదికగా వ్యక్తిగత అంచనా, సమష్టిగా విలువ గట్టడం" అనే విధానాన్ని ప్రవేశపెట్టినప్పుడు ప్రతి పది, పదిహేను రోజులకు సమావేశమై వర్క్ పాయింట్లు నిర్ణయించేవారు. తర్వాత, సభ్యుల రాజకీయ చైతన్యం పెరిగే కొద్దీ ఆ సమావేశాలు అంత తరచుగా కాకుండా ప్రతి నెలకొకసారి, తర్వాత ప్రతి మూడునెలలకొకసారి జరిగేవి. ఎనిమిదేళ్ళ ఆచరణ తర్వాత సమావేశాలు సంవత్సరానికొకసారి మాత్రమే జరిగేవి. రాజకీయ చైతన్యం ఇంకా పెంపొందటం వల్ల, అనేక మంది సభ్యులు ప్రామాణిక వ్యక్తి చేసే పనిని చేయటం వల్ల, ఇక ఏదో ఒక్క వ్యక్తి పనిని కొలబద్దగా తీసుకోవలసిన అవసరం లేక పోయింది. దీని ఫలితంగా "ఏకీకృత వర్క్ పాయింట్ ప్రమాణాలపై వ్యక్తిగత అంచనా, సమష్టిగా విలువ గట్టడం" అనే విధానంగా అది రూపొందింది. వాతావరణ పరిస్థితి, వెచ్చించబడిన మొత్తం శ్రమ, దిగుబడుల కనుగుణంగా శరత్‌కాలం కోతల తర్వాత ఈ ప్రమాణాన్ని (అంటే, ఒకరోజు పనికి ఒక సభ్యునికి ఇవ్వగల అత్యధిక పాయింట్ల సంఖ్య) నిర్ణయించేవారు. అలా ప్రతి సభ్యుడు తాను ఆ ప్రమాణాన్ని చేరుకున్నాడో లేదో చూసి, ఇతరులతో తన పనిని పోల్చుకుని అప్పుడు తన రేటును ప్రతిపాదిస్తాడు. దీనిని తర్వాత చర్చిస్తారు. గతంలో వర్క్ పాయింట్ల విషయంలో రోజూ జరిగే తగువులు కొద్ది రోజుల్లోనే పరిష్కారమయ్యేవి. తాచాయ్‌లో 'ప్రతివారికీ పనికి తగ్గ ఫలితం' అనే సూత్రం అమలులో ఉన్నా, ఈ దశలో ఇప్పటికే అందులో కొన్ని కమ్యూనిస్టు లక్షణాలు కూడ తలెత్తాయి. ఉదాహరణకు పనిచేస్తుండగా ప్రమాదం జరిగి ఒక కమ్యూన్ సభ్యుడు చనిపోతే అతని పిల్లలు పెరిగి చేతికొచ్చేవరకు బ్రిగేడ్ అతని కుటుంబాన్ని పోషించేది. పనిలో అయిన గాయాలకు అవసరమయిన వైద్య ఖర్చులన్నీ భరిస్తూ, ఆ వ్యక్తి మామూలుగా పని చేస్తుంటే వచ్చే ప్రతిఫలాన్ని కూడ ఇచ్చేవారు. పిల్లలకు పాలిచ్చే తల్లులను వర్క్ పాయింట్లలో కోత ఏమీ లేకుండా, ఇతర సభ్యులకంటె అర గంట ముందు వదిలేసే వాళ్ళు. చిన్న పిల్లలకు పగలు సంరక్షణ సదుపాయాలు, కిండర్ గార్టెన్ పాఠశాలలు ఉండేవి. ఆధారపడటానికి కుటుంబాలు లేని ముసలి, పేద మధ్యతరగతిలో అట్టడుగున ఉన్న రైతాంగం పోషించబడేవారు. తమపై ఆధారపడే తల్లిదండ్రులు లేనటువంటి యువదంపతులు

తప్పకుండా తమ ఆదాయంలో కొంత భాగాన్ని వీరికోసం వెచ్చించే ఏర్పాటు చేశారు. అంతేగాక అనేక కమ్యూన్లు తయారు చేయబడిన ఆహారం విషయంలో మాత్రమే 'ఉచిత సరఫరా' విధానాన్ని చేపట్టినట్టు చైనా అధికార పత్రికలు తెలిపాయి. దీనివల్ల శ్రమశక్తి తక్కువగా ఉండి ఎక్కువమంది సభ్యులు ఉన్న కుటుంబాలకు ఆహార సమస్య గురించి విచారించడం అవసరం లేకపోయింది. ఏది ఏమైనా ఈ ఉదాహరణ లన్నింటినీ "అవసరాలకు అనుగుణంగా అనుభవించడం" అనే కమ్యూనిస్టు సమాజ సూత్రానికి సోపానాలుగానే గుర్తించాలి. సాంస్కృతిక విప్లవకాలంలోనేగాక దానికి ముందు కాలంలో కూడా ఇటువంటి కమ్యూనిస్టు అంశాలు తలెత్తాయి. సమష్టి ఆస్తి లేదా కమ్యూన్ ఆస్తిని ప్రజలందరి ఆస్తిగా మార్చడంలో మరో ముందడుగు సాంస్కృతిక విప్లవ కాలంలో జరగనప్పటికీ పంపిణీ విషయంలో కమ్యూనిస్టు అంశాలు ఆవిర్భవించాయనేది గమనించాల్సిన విషయం. సరుకు ఉత్పత్తి, మారకం, బూర్జువాహక్కు, విలువ నిర్ణయ సూత్రాలను పరిమితం చేయకుండా చైనా పార్టీ ఎంతగానో ప్రచారం చేసిన ఈ విప్లవాత్మక నూతన విషయాలు తలెత్తి ఉండేవి కావు. దీనిని బట్టి సాంస్కృతిక విప్లవం సరుకుల ఉత్పత్తిని ముట్టుకోవడమే గాక తీవ్రమైన మార్పులు తీసుకొచ్చిందనేది స్పష్టమౌతుంది. అయితే, బాలగోపాల్ రాసినట్టు అది "ఒకంతట పరిష్కారమయ్యే సమస్యకాదు". ఈ దశలో సరుకు ఆర్థిక విధానాన్ని పూర్తిగా నిర్మూలించలేమని చైనా కమ్యూనిస్టు పార్టీయే స్పష్టంగా ప్రకటించింది.

ఇక పునరుత్పత్తి క్రమం గురించి బాలగోపాల్ ఇలా వివరించారు : "ఉత్పత్తి క్రమం, పునరుత్పత్తి క్రమం, పెనవేసుకుని ఉంటాయి. ఉత్పత్తి క్రమం అంటే ముడిసరుకు ఫాక్టరీలోకి ప్రవేశించిన దగ్గరనుండి ఒక వస్తువు ఉత్పత్తి అయేదాకా నడిచే క్రమం. ఇట్లా ఉత్పత్తి అయిన వస్తువులు మొత్తం వాడకానికి పంపిణీ కావు. కొంత భాగం పొదుపు చేయబడుతుంది. అంటే మూలధనం (మామూలు పరిభాషలో పెట్టుబడి (Capital) లో కలుస్తుంది. దీన్ని ఏం చేయాలి ? మళ్ళీ ఉత్పత్తికి ఎంత భాగం వినియోగించాలి, సాంఘిక సంక్షేమం కోసం ఎంత వినియోగించాలి ? మళ్ళీ ఉత్పత్తికి వినియోగించేటట్లయితే ఏ ఉత్పత్తిలో పెట్టాలి ? ఆయుధాలా, ఔషధాలా, ధాన్యమా, కలర్ టెలివిజనా ? సాంఘిక సంక్షేమం కోసం అంటే పట్టణంలో పార్కులా, పల్లెల్లో ఆస్పత్రులా ? ఈ నిర్ణయాలను తీసుకునేది పునరుత్పత్తి క్రమం. ఈ నిర్ణయాలే పునరుత్పత్తిక్రమం". పునరుత్పత్తి క్రమాన్ని సాంస్కృతిక విప్లవం ప్రభావితం చేయలేదా ? అయితే పట్టణానికీ పల్లెలకూ మధ్య విభేదాన్ని తొలగించాలనే లక్ష్యంతో గ్రామీణ రైతాంగం పరిస్థితులను మెరుగు పరచడానికి సాంస్కృతిక విప్లవకాలంలో ప్రభుత్వమే వ్యవసాయోత్పత్తుల ధరలను పెంచి కొనుగోలు చేసినట్టు,

అసలు విలువ కంటే తక్కువ ధరలకే వ్యవసాయ పరికరాలు, యంత్రాలు అందించినట్టు కొన్ని పత్రికలు రాశాయి. అయినా కార్మికులు ఈ చర్యలను హృదయ పూర్వకంగానే తీసుకున్నారు గానీ విరసన గాని, తిరుగుబాటు కాని చేయలేదు. అది ఎలా సాధ్యమయింది ? ఉన్నత సమాజాన్ని నిర్మించడానికి కార్మికులు తాము చేయాల్సిన త్యాగం గురించి సాంస్కృతిక విప్లవం వారిలో పెంపొందించిన చైతన్యం కారణం కాదా ?

అయితే బాలగోపాల్ ఇక్కడ చెప్పిన విషయం సోషలిస్టు వ్యవస్థలో స్టేట్ ప్లానింగ్‌కు సంబంధించిన విషయంగా అర్థమవుతుంది. అలాంటప్పుడు పునరుత్పత్తి క్రమంతో పాటు జాతీయ ఆదాయం పంపకమూ, పునఃపంపకమూ, ప్రభుత్వ బడ్జెట్ వినియోగం ఎలా జరుగుతుందీ అనే అంశాలను కూడా వివరిస్తే పునరుత్పత్తి పట్ల అవగాహన స్పష్టంగా ఏర్పడి ఉండేది. అలా వివరించనందున, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు, అంటే పట్టణంలో పార్కులు, పల్లెల్లో ఆసుపత్రుల నిర్మాణం వంటి సామాజిక వినియోగానికి సంబంధించిన విషయాలను కూడా పునరుత్పత్తి క్రమం పేరుతో ఉత్పత్తిరంగాలుగానే పరిగణించే గందరగోళానికి గురికావాల్సి వచ్చింది. (ప్రజా ఆరోగ్య, విద్యారంగాలలో పనిచేసేవాళ్ళ సేవలు, శ్రమశక్తి మామూలు పునరుత్పత్తికి అవసరం. అవి ప్రత్యక్షంగా జాతీయ ఆదాయాన్ని సృష్టించనప్పటికీ కార్మికుల నైపుణ్యాలను పెంచడం ద్వారా అవి పరోక్షంగా దానిని పెంపొందిస్తాయి.)

ఉత్పత్తి క్రమం అంటే భౌతిక సంపదల సృష్టి క్రమమే. దీని సమాజం ఆపజాలదు. క్రమం ఒక దశ పూర్తి కాగానే మరొక దశ, ఇలా దశ తర్వాత దశ కొనసాగవలసిందే. ఈ విధంగా నిరంతరం ఒకటి ముగిసిన తర్వాత మరొకటి ప్రారంభిస్తూ పునఃపునః సాగించే భౌతిక సంపదల ఉత్పత్తి క్రమాన్నే పునరుత్పత్తి అంటాం.

ఇకపోతే ఉత్పత్తిలో శ్రామిక ప్రజానీకంచే నూతనంగా సృష్టించబడిన భౌతిక సంపద జాతీయాదాయం అవుతుంది. సోషలిస్టు దేశాలలో మొత్తం జాతీయాదాయం శ్రామిక ప్రజలకే చెందుతుంది. అంటే అందులో ఒక భాగాన్ని వారు తమ జీవన పరిస్థితులను కొనసాగించుకోవడానికీ మెరుగుపరచుకోవడానికీ వాడుతారు. మిగిలిన భాగాన్ని విస్తృత పునరుత్పత్తి లేదా సమీకరణ కోసం ఉపయోగిస్తారు. జాతీయాదాయ పంపకమూ పునఃపంపకమూ రెండింటిలోనూ వినియోగం సమీకరణల మధ్య తగిన నిష్పత్తి ఉండేట్లు చూడగలగాలి. వినియోగానికి సంబంధించిన భాగం చాలా తక్కువగా ఉంటే ప్రజల జీవనంలో మెరుగుదల ఉండదు. సమీకరణకు సంబంధించిన భాగం అతి తక్కువగా ఉంటే విస్తృత పునరుత్పత్తి కుంటుపడుతుంది. రెండూ కూడా ప్రజల ప్రయోజనాలకు భంగం చేసేవిగానే ఉంటాయి. జాతీయాదాయం యొక్క ద్వితీయ పంపకం బడ్జెట్ రూపేణా జరుగుతుంది గనుక, ఆ సొమ్మును జాతీయ

రక్షణ, ప్రభుత్వ యంత్రాంగం, పరిశ్రమల నిర్మాణం, ఆర్థిక, సాంస్కృతిక, విద్యా సంస్థలు వీటి మధ్య ఎలా పంపకం చేయాలో కూడా నిర్ణయించాలి. ఏదేమైనా ఈ విషయాలన్నీ నిర్ణయించేది ప్రభుత్వ ప్లానింగ్ వ్యవస్థే. సోషలిస్టు సమాజంలో విలువ నిర్ణయ సూత్రం ఉత్పత్తిని క్రమబద్ధం చేయదు. ప్లానింగే ఉత్పత్తిని నిర్ణయిస్తుంది. సోషలిస్టు సమాజంలో ప్లానింగ్‌కు ఉన్న ప్రాధాన్యతను గుర్తించటంతోపాటు "ఎటువంటి పరిస్థితులలోనూ ప్రజలు కాక ఎవరో ప్లానింగ్‌కు సంబంధించిన వారే చరిత్రను నిర్మిస్తారను కోవడం పొరపాటే అవుతుంది" అని కూడా మావో 'క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్'లో అన్నారు. అంతేగాక ఆయన "ప్లానింగ్ రాజకీయాలే ఆధిపత్యం వహించటం - ఇవే ఉత్పత్తిని క్రమబద్ధం చేసే కర్తవ్యాన్ని నిర్వహించాలి". "మొత్తం ఆర్థిక కృషి అంతటికీ జీవనాధారం రాజకీయ కృషే అవుతుంది". "రాజకీయ సైద్ధాంతిక పంథానే ప్రతి దాన్నీ నిర్ణయిస్తుంది" అని అన్నారు. మావో ప్లానింగ్ విషయం ప్రస్తావించినప్పుడల్లా 'రాజకీయాలే ఆధిపత్యం వహించటం' అనే అంశాన్ని కూడా ముందుకు తెచ్చి దాని ప్రాధాన్యతను వివరించారు. ఈ సందర్భంగా సోషలిస్టు దశలో పార్టీకి మార్గదర్శకత్వంగా తీసుకోవాలంటూ మావో ప్రతిపాదించిన సాధారణ పంథాను కూడా పేర్కొనాల్సి ఉంటుంది. దానికి ఎంతో ప్రాముఖ్యత ఉందనేది నిర్వివాదం.

అయితే మిగతా అంశాలను తడిమినప్పుడు చెప్పినప్పటికీ, సోషలిస్టు వ్యవస్థలో ప్లానింగ్ అంశాన్ని వివరించేటప్పుడు "రాజకీయాల ఆధిపత్యం" అనే విషయాన్ని గానీ "సాధారణ పంథా ప్రాముఖ్యత"ను గానీ బాలగోపాల్ పేర్కొనలేదు. వ్యాసంలో ఎక్కడ కూడా సాధారణపంథా ప్రాముఖ్యతను వివరించకపోవడం లోపంగానే చెప్పాల్సి ఉంటుంది. అలా పేర్కొని ఉంటే మరింత సమగ్రమయిన అవగాహన ఏర్పడి ఉండేది. ఆయన వివరించిన దాన్నిబట్టి ప్లానింగే సర్వస్వం అనే అవగాహన ఏర్పడడానికి కూడా ఆస్కారం ఉంది.

4. "అంతర్జాతీయంగా విప్లవం మందకొడిగా ఉండడం చైనాలో సాంస్కృతిక విప్లవం ఓటమికిగల ముఖ్యకారణాలలో ఒకటి" అని బాలగోపాల్ ఆఖరిపేజీలో వివరించారు. అలాకాకుండా ప్రధాన కారణమేమిటో వివరిస్తే పాఠకులకు మరింత ఉపయోగకరంగా ఉండేది. ఈ సమస్య పట్ల సమగ్రమైన అవగాహన పెంపొందించు కోవడానికి అది ఎంతో అవసరం. ఒక దేశంలో విప్లవం ఓటమికయినా, పెట్టుబడి దారీ పునరుద్ధరణ కయినా ఆ దేశంలో అంతర్గత పరిస్థితులే ప్రధానకారణమవుతాయి. బాహ్యకారణాలు ఒక క్రమాన్ని త్వరితం చేయటమో, వెనక్కు నెట్టడమో మాత్రమే చేస్తాయి. 'క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్'లో మావో అభివృద్ధి చెందిన సోషలిస్టు దేశాల సహాయం వల్లనే పెట్టుబడిదారీ విధానం ముందునాటి ఆర్థిక వ్యవస

లున్న దేశాలు సోషలిస్టు విప్లవాన్ని కొనసాగించ గలిగాయని చెప్పటం అస మగ్రమే అవుతుందంటూ "అంతర్గత కారణాలే ప్రధానమయినవి. సోషలిజం జయ ప్రదమయిన దేశాలనుండి మనం అందుకునే సహాయం ఒక ముఖ్యమైన అవశ్యకమే అయినప్పటికీ మనం సోషలిస్టు విప్లవాన్ని అవలంబించడమా, అవలంబించకపోవడమా అనే సమస్యను ఇది పరిష్కరించజాలదు. మనం ఆ మార్గాన్ని చేపట్టిన తర్వాత మన పురోగమన తీవ్రతను మాత్రమే అది ప్రభావితం చేస్తుంది. సహాయం అందుకో గలిగితే మనం చాల త్వరిత గతిన పురోగమించగలుగుతాం. లేకుంటే అలాగాక నెమ్మదిగా పురోగమిస్తాం. సహాయమంటే, ఆర్థిక సహాయంతోపాటు, సహాయం చేస్తున్న దేశం విజయాలకూ, వైఫల్యాలకూ సంబంధించిన అనుకూల, అననుకూల అనుభవాలను దృఢంగా అన్వయించడం కూడా దానిలో ఇమిడి ఉంటుంది" అన్నారు. మావో ప్రతిపాదించిన సాధారణ పంథాలో సోషలిస్టు దశ అంతటిలోనూ, సోషలిస్టు పంథాకూ పెట్టుబడిదారీ పంథాకూ మధ్య పోరాటం ఉంటుందని, పెట్టుబడిదారీ పున రుద్ధరణ ప్రమాదం ఉంటుందనీ హెచ్చరించాడు. ఇకపోతే నేడు అంతర్జాతీయంగా విప్లవం మందకొడిగా ఉందనటం సరైనదేనా? కాదనే చెప్పాలి. ఎందుకంటేఫిలిప్పైన్స్, మలేషియా, థాయిలాండ్, బర్మా, కంపూచియా, ఆఫ్ఘనిస్తాన్, టర్కీ వంటి ఆసియా దేశాలలో పెరూ, చిలీ, ఎల్‌సాల్వడార్ వంటి లాటిన్ అమెరికా దేశాలలో విప్లవ శక్తుల నాయకత్వం కింద విముక్తి పోరాటాలు, ఎరిట్రియా, నమీబియా, దక్షిణాఫ్రికా దేశాలలో విముక్తి పోరాటాలు, తదితర అనేక దేశాలలో ప్రజావెల్లువ, యూరప్ దేశాలలో యుద్ధవ్యతిరేక ఉద్యమం సైతం బలం పుంజుకుంటున్నాయి. మావో ఆలో చనా విధానం వెలుగులో పనిచేస్తున్న మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల కింద పలుదేశాలలో కొద్దోగొప్పో విముక్తి సైన్యాలుకూడా ఏర్పడి పనిచేస్తున్నాయి. ఈ పరిణామాలతో పాటు అతి సమీప భవిష్యత్తులో మూడో వరుస విప్లవాల వెల్లువ బద్దలయ్యేకాలం మన ముందుంది. ఇది సాధారణ సంక్షోభపు మూడవ దశ గనుక ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాదులకన్న విప్లవశక్తులకే అనుకూలమైన అవకాశాలున్నాయి. గత రెండు యుద్ధాల మూలంగా సామ్రాజ్యవాదం చాల బలహీనపడింది. నేడు సామ్రాజ్యవాదం సాధారణ సంక్షోభపు మూడవదశలో చిక్కుకుని ముందెన్నడూ లేనంత బలహీనతలో కొట్టుమిట్టాడుతున్నది. దీనిని పరిగణనలోకి తీసుకోకపోతే, శత్రువు చాలాబలంగా ఉన్నాడనే అతి అంచనా, విప్లవశక్తుల బలాన్ని తక్కువ అంచనా వేసుకోవడానికి అవకాశం ఉంది. విప్లవశక్తుల బలాన్ని అతిగా అంచనా వేసుకుని శత్రువు బలాన్ని తక్కువగా అంచనా కడితే ఎలా నష్టమో ఇదికూడా అలానే నష్టం. ఏదేమైనా సామ్రాజ్యవాదం యొక్క బలహీనతను గుర్తించడం నేడు విప్లవ శక్తుల ఆచరణ విషయంలో ఎంతైనా ప్రాముఖ్యత కలిగిన అంశంగానే పరిగణించాలి.

సమీక్ష వ్యాసం :

# కుటుంబం - మార్క్సిజం

సురా

రంగనాయకమ్మగారి జానకి విముక్తి నవలతో మొదలయి సాహిత్యాభిమానులలో స్త్రీ విముక్తిమీద ఆసక్తికరమయిన చర్చ ఒకటి రేగింది. తెలుగులో గత వంద సంవత్సరాల కాలంలో సమాజంలో స్త్రీ స్థానం గురించి చర్చ వచ్చినప్పుడల్లా అది సాహిత్యంలోనే మొదలయింది. ఒక దశలో కందుకూరి, గురజాడ, ఆ తర్వాత చెలం, చాలాకాలంపాటు కొ.కు, ఈ మధ్యకాలంలో రంగనాయకమ్మ అందుకు ఉదాహరణలు. ఒక నాటకమో, కథో, నవలో సమాజం గురించి మౌలికమయిన చర్చకు దారితీయడం ఆ సృజనాత్మక సాహిత్యానికి ఒక నివాళి. కాని రెండో వైపు అది రాజకీయ వైఫల్యానికి కూడా ఒక సూచిక.

మిగతావాళ్ళ సంగతెలా ఉన్నా కమ్యూనిస్టులలో మాత్రం ఈ రాజకీయ వైఫల్యాలకు సిద్ధాంత బలహీనత ఒక కారణం. సమాజంలో వచ్చిన మార్పుల వల్లగాని, జీవితానుభవం నుండి గాని, పోరాట క్రమం నుండి గాని, అలవడే చైతన్యం ఏదో ఒక దశలో సైద్ధాంతిక అవగాహనకు దారితీయాలి. లేకపోతే ఆ రకంగా అలవడే చైతన్యానికి సామాజిక స్థాయిలో ప్రయోజనం లేకుండా పోతుంది. ఒక విషయం మీద ఒక దశలో జరిగిన చర్చలే రూపం మార్చుకొని (ఒకోసారి మార్చుకోకుండా) మళ్ళీ జరుగుతుంటాయి. ప్రతి తరానికి కొత్తగా పాత విషయాలు తెలుసుకోవడానికే కాలం వృథా అవుతుంది అందుకే విజ్ఞానశాస్త్రం అవసరం. శాస్త్రీయ పద్ధతులలో సామాజిక విశ్లేషణ అవసరం. సైద్ధాంతిక అవగాహన అవసరం.

మన సమాజంలో స్త్రీ స్థానపు పునాదులు మన కుటుంబ వ్యవస్థలో ఉన్నంత మేరకు, ఈ చర్చలకు కుటుంబ వ్యవస్థపై సైద్ధాంతిక అవగాహన అవసరం. ఆ అవగాహన కోసం సాగిన ప్రయత్నమే ఈ ప్రసంగవ్యాసం *. 1984 మేలో చిత్తూరులో విప్లవ రచయితల సంఘం మార్క్స్ శతవర్ధంతి సందర్భంగా నిర్వహించిన పాఠశాలలో ఇది భాగం. పది నెలలు ఆలస్యంగా అయినా అచ్చయిన మొదటి వ్యాసం ఇదే.

---

* కుటుంబ వ్యవస్థ-మార్క్సిజం : ఓల్గా, విరసం ప్రచురణ. మార్చి, 1985. పే 40 వెల రూ. 1.25. ప్రతులకు : విరసం, సి. ఎస్. ఆర్. ప్రసాద్ సి - 132 శ్రీనివాస నగర్ కాలనీ, గుంటూరు

ఈ ప్రసంగ వ్యాసం మొదట పితృ స్వామిక వ్యవస్థనూ, ప్రత్యేకించి పితృ స్వామిక కుటుంబాన్ని దాని లక్షణాలను పరిచయం చేస్తుంది. పితృస్వామిక కుటుంబ వ్యవస్థకు "స్త్రీలపై పురుషుల పెత్తనం ప్రధాన ఆధారం". పురుషాధిపత్య సమాజం తనను తాను పునరుత్పత్తి చేసుకోవడానికి కుటుంబం ప్రధాన సాధనం. ఆ క్రమంలో భాగంగానే "పిల్లలను సంఘ జీవులుగా రూపొందించడం కుటుంబ ప్రాథమిక కర్తవ్యం" అయింది. ఈ పునరుత్పత్తి క్రమం భౌతిక పునరుత్పత్తి క్రమానికి అవసరం. ఆరకంగా దోపిడీ వ్యవస్థలో కుటుంబ వ్యవస్థ ఒక ఉపాంగం అయింది.

అయితే మానవుడి భౌతిక జీవిత పరిస్థితులు అభివృద్ధి చెందుతున్న కొద్దీ మానవ సమాజంలో గుణాత్మక మార్పులు వచ్చాయి. ఉత్పత్తిశక్తుల అభివృద్ధి, ఉత్పత్తి సంబంధాలలో వచ్చిన మార్పులతో ఆదిమ సమాజం నుండి సోషలిష్టు సమాజందాకా విభిన్న సామాజిక వ్యవస్థలు వచ్చాయి. మానవ సమాజంలో వచ్చిన ఈ గుణాత్మక మార్పులు పితృస్వామిక కుటుంబ వ్యవస్థలో కూడా అనుగుణమయిన గుణాత్మక మార్పులను తీసుకువచ్చాయా ?

ప్రతి దశలోనూ కుటుంబ వ్యవస్థలో మార్పులు రాకుండా పోలేదు. అయితే దాని సారాంశలక్షణ మయిన పురుషాధిక్యతలో మాత్రం మార్పులు రాలేదు. కుటుంబం లోపలా, సామాజిక జీవితంలోనూ పురుషాధిక్య భావజాలం ఆలాగే నిలిచింది. అంటే సామాజిక వ్యవస్థలో గుణాత్మక మార్పుల కనుగుణంగా వాటంతటవే కుటుంబ వ్యవస్థలో మార్పులు వస్తాయనుకోవడానికి వీలులేదు. అందుచేత విప్లవ విజయా నంతరం మార్పులు వస్తాయిలే అన్న వాదన సమస్యను దాచేయడానికి జరిగే ఆత్మ వంచనగా తప్ప మరెందుకు పనికిరాదు. (కొండకచో పరవంచనగా కూడా అని రచ యిత్రి ఉదాహరణలు కూడా ఇచ్చారుగాని అది వేరేకథ.)

నిర్దిష్ట సామాజిక వ్యవస్థలో నిర్దిష్ట ఉపాంగంగా ఉన్న పితృస్వామిక వ్యవ స్థకు, ఆ సామాజిక వ్యవస్థనుండి, దాన్ని నిర్దేశించే గతి చలన సూత్రాల నుండి స్వతంత్ర ప్రతిపత్తి (autonomy) ఉందా ? ఉంటుందా? ఈ ప్రశ్నచుట్టు ప్రపంచ వ్యాప్తంగా మార్క్సిస్టులలో గత దశాబ్దకాలంగా తీవ్రమయిన చర్చ జరుగుతోంది. రచయిత్రి ఈ చర్చను ప్రస్తావించలేదు కాబట్టి, నేనుకూడా దాన్ని ప్రక్కన పెట్టి ప్రసంగ వ్యాసానికే పయన మవుతాను.

రెండవ భాగంలో కుటుంబ వ్యవస్థ గురించి మార్క్సిస్ట్ దృక్పథాన్ని

(ముఖ్యంగా మార్క్స్, ఏంగెల్స్) రచయిత్రి వివరించారు. స్త్రీ పురుషుల మధ్య సహజశ్రమ విభజన పునాదిగా వర్గసమాజం రూపం తీసుకొంది. ఉత్పత్తి పంపకంలో అసమానతలు రూపం తీసుకొన్నాయి. క్రమంగా సహజ శ్రమ విభజన సామాజిక శ్రమ విభజన అయింది. ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి, ఉత్పత్తి సంబంధాలకు స్త్రీ పురుషుల మధ్య శ్రమ విభజన ప్రాతిపదికయింది. సామాజిక శ్రమ విభజనకు వర్గ సమాజానికి మధ్య భౌతిక ఉత్పత్తికి, సంతానోత్పత్తికి మధ్య అన్యోన్య దోపిడీ సంబంధం ఏర్పడింది. ఆ రకంగా "కుటుంబ వ్యవస్థ సామాజిక వ్యవస్థను తెలియజేస్తుంది".

ఈ ఉత్పత్తి క్రమం కేంద్రంగా ఏర్పడ్డ మానవ సమాజానికి దాని పరిణామ క్రమానికి గతితార్కిక చలన సూత్రాలను అన్వయిస్తూ చారిత్రక భౌతిక వాద దృక్పథాన్ని మార్క్సిజం ఇచ్చింది. ఈ గతి చలన సూత్రాలు సార్వజనీకమయినవి. వాటిని అన్వయించే పద్ధతి సార్వజనీకమయింది. కాని ఆ సామాజిక వ్యవస్థలు (విస్తృతార్థంలో తప్ప), సార్వజనీకమయినవి కావు. ఆ వ్యవస్థలో ఉండే విభిన్న అంశాలకు, ఉపాంశాలకు నిర్దిష్ట లక్షణం ఉంటుంది. ఆ నిర్దిష లక్షణం లేకపోతే వాటి ఉనికేలేదు. కుటుంబ వ్యవస్థ కూడానిర్దిష్ట చారిత్రకదశలో నిర్దిష్ట లక్షణాలు గల వ్యవస్థ.

అప్పటికి కుటుంబ వ్యవస్థ గురించి తెలిసిన సమాచారం ఆధారంగా (ముఖ్యంగా మోర్గాన్) గతి తార్కిక భౌతికవాద దృక్పథంతో, ఎంగెల్స్ కుటుంబ వ్యవస్థను ప్రత్యేకించి యూరోపియన్ కుటుంబ వ్యవస్థను విశ్లేషించాడు. అలాగే మన సమాజంలో కుటుంబ వ్యవస్థ మీద సైద్ధాంతిక అవగాహన చరిత్రలో మన కుటుంబ వ్యవస్థ నిర్దిష్ట లక్షణాలను పరిగణనలోకి తీసుకుంటూ సాగాలి. మూడవ భాగంలో ఈ ప్రసంగ వ్యాసం ఆ పని మొదలెట్టి, సగంలో వదిలేసి, మనల్ని కొంత నిరుత్సాహ పరుస్తుంది. అయినా భూస్వామ్య సమాజంలో స్త్రీ స్థానపు సమీక్షతో మొదలెట్టి మన పితృస్వామిక కుటుంబ వ్యవస్థ గురించి రచయిత్రి వివరించారు.

భూస్వామ్య సమాజంలో స్త్రీ నిషేధాల మాటున పుట్టి పెరుగుతుంది. ఆ సమాజం తన అవసరాలకోసం "స్త్రీలకు నిర్ణయించిన విధులను నెరవేర్చడమే లక్ష్యంగా స్త్రీ బతుకుతుంది". మతం, ఆచారవ్యవహారాలు, సంఘపు కట్టుబాట్లు, నీతి నియమాలు - అన్ని పురుషాధిక్యతకు సామాజిక గౌరవాన్ని కలిగిస్తాయి. అసమాన శ్రమ విభజనలో తన వంతు పని చేయడమే తన విధిగా స్త్రీ భావిస్తుంది. ఈ విధిని

నిర్వర్తింప జేయడం కోసం ఏర్పరచిన నియమాల్నే స్త్రీ ధర్మంగా విశ్వసిస్తుంది. స్త్రీలలో ఈ భావాలని, విశ్వాసాలనీ పెంపొందించడమే కుటుంబ వ్యవస్థ నిర్వహించే పాత్ర. శ్రమదోపిడీని, పురుషాధిక్యతను సహజంగానూ, ధర్మంగానూ చిత్రీకరించే భావజాల సాధనంగా కుటుంబ వ్యవస్థ మన సమాజంలో ఇప్పటికి ఈ పాత్రను నిర్వహిస్తోంది.

పాశ్చాత్య దేశాలలో పారిశ్రామిక విప్లవం వల్ల ఈ భూస్వామ్య సమాజం కదిలిపోయింది. పెట్టుబడిదారీ సమాజాలు ఏర్పడ్డాయి. శ్రమ శక్తి సరుకయింది. శ్రమ శక్తి తప్ప మిగతా అన్నిటిని పోగొట్టుకున్న పురుషుడి అవసరాలను తీర్చడం కోసం స్త్రీకి చదువు నేర్పడం అవసరం అయింది. స్త్రీ విద్య ఎజెండాలోకి వచ్చింది.

పెట్టుబడిదారీ సమాజం తీసుకొచ్చిన ఈ మార్పులను ఇంత మేరకు మాత్రమే చెప్పిరచయిత్రి ఈ క్రమాన్ని అసంపూర్తిగా వదిలేసారు. రూసో కోరుకున్నట్టు శక్తివంతమయిన (Efficient) శ్రామిక పురుషున్ని తయారు చేయడం కోసం స్త్రీకి విద్య నిచ్చిన మాట నిజమే గాని, స్త్రీకి విద్య పెట్టుబడి ప్రత్యక్ష ప్రయోజనాల కోసం కూడా అవసరమయింది. స్త్రీ శ్రామికులు, చదువు నేర్చిన స్త్రీ శ్రామికులు పెట్టుబడికి అవసరమయ్యారు. పెట్టుబడిదారీ సమాజం కూడా సంతాన పునరుత్పత్తి కోసం స్త్రీ పురుషుల మధ్య సామాజిక శ్రమ విభజనను అలాగే కొనసాగనిచ్చింది. అది పితృస్వామిక కుటుంబ వ్యవస్థలో - సారాంశంలో - ఏ మార్పులు తీసుకురాలేక పోయింది. అయితే రెండో వయిపు పెట్టుబడికి స్త్రీ శ్రమ శక్తి కూడా అవసర మయింది. అది స్త్రీపురుషుల మధ్య అప్పటికే ఉన్న శ్రమ విభజనను మరింత బలోపేతం చేసింది. ఉత్పత్తి స్థాయి (scale) పెరుగుతున్న కొద్దీ, సాంకేతిక శ్రమ విభజన పెరిగింది. ఈ సాంకేతిక శ్రమ విభజనలో తక్కువ నైపుణ్యం అవసరమయిన పనులకు పురుషులకు శిక్షణనిచ్చి, తక్కువ నైపుణ్యత అవసరమయిన పనులకు స్త్రీలకు శిక్షణ నిచ్చింది. పురుషుడు మేనేజర్ అయితే స్త్రీ స్టెనో అయింది. పురుషుడు పైలెట్ అయితే స్త్రీ ఎయిర్ హోస్టెస్ అయింది. రెండు శతాబ్దాలు గడిచింతరువాత కూడా పాశ్చాత్య పెట్టుబడిదారీ సమాజాలలో ఈ రకం శ్రమ విభజన ఇప్పటికీ కొట్టొచ్చినట్టు కన్పిస్తుంటుంది. ఈ సాంకేతిక శ్రమ విభజనకు అనుగుణంగా స్త్రీలలో తీర్చిదిద్దడం అక్కడి పితృస్వామిక కుటుంబ వ్యవస్థకు అదనపు బాధ్యత అయింది.

ఏమయినా ఈ పూర్వరంగంలో మన సమాజంలో స్త్రీ స్థానాన్ని, ఆ స్థానాన్ని

యధాతథంగా ఉంచడంలో కుటుంబ వ్యవస్థ పాత్రని రచయిత్రి వివరంగా చర్చించారు. ఆడ పుట్టుక, పుట్టినప్పటి నుండి ప్రవర్తనా నియమావళి, స్త్రీకి తన శరీర ధర్మాల గురించి ఆత్మ న్యూనతా భావం ఇంటి బయట సాంఘిక జీవితంలోకి వెళ్ళినప్పుడు స్త్రీ పాటించాల్సిన నియమాలు, పాటించక పోతే ఎదుర్కోవాల్సిన అవమానాలు, పెళ్ళి కట్నం పెళ్ళి తంతు - ఇవన్నీ కూడ సామాజిక అవసరాలను తన కర్తవ్యంగా భావిస్తూ తీర్చగల మనిషిగా స్త్రీని తయారుచేసే క్రమంలో భాగమే. ఆ క్రమాన్ని పకడ్బందీగా నడిపించేదే కుటుంబ వ్యవస్థ. చివరికి ఇంటి చాకిరి పిల్లల పెంపకం అనే రెండు విధులను నిర్వర్తించేదిగా స్త్రీ తయారు చేయబడ్తోంది. అంతేకాక ఈ మొత్తం భావజాలాన్ని తిరిగి తన పిల్లలకి నూరి పోసేదిగా-కూడా స్త్రీ తయారవు తుంది. కుటుంబ వ్యవస్థ తనను తాను పునరుత్పత్తి చేసుకుంటుంది.

భూస్వామ్య భావజాలం, పితృస్వామిక కుటుంబ వ్యవస్థ ఇలా కొనసాగు తున్న దేశంలో పందొమ్మిదవ శతాబ్దంలో సామ్రాజ్యవాదులు పెట్టుబడిని ప్రవేశ పెట్టారు. పాశ్చాత్య దేశాలలో భూస్వామ్యాన్ని భూస్థాపితం చేసిన పెట్టుబడికి సామ్రాజ్యవాద దశలో ఆ అభ్యుదయకర స్వభావం పోయింది. ఈ వలస దేశాలలో పెట్టుబడి ప్రవేశించిన తరువాత కుటుంబ వ్యవస్థలో వచ్చిన మార్పులను చర్చించ కుండా రచయిత్రి నేరుగా సోషలిస్ట్ సమాజంలో స్త్రీ స్థానం అనే అంశంలోకి వెళ్ళి పోయారు. మనం ఇక్కడ ఆగి గడిచిన శతాబ్దకాలంలో మన సమాజంలో కుటుంబ వ్యవస్థ గురించి, స్త్రీ స్థానం గురించి చర్చించుకుందాం.

పెట్టుబడి ప్రవేశించిన తరువాత ఇక్కడకూడా దానికవసరమయిన పురుషుణ్ణి తయారుచేయడం కోసం స్త్రీల 'అభివృద్ధి' అవసరం అయింది. తర్వాత కాలంలో పెట్టుబడి ప్రత్యక్ష ప్రయోజనాలకోసం కూడా అది కొనసాగింది. అందుకోసం 'సంఘ సంస్కరణ' పెట్టుబడికి ఒక అవసరం అయింది. ఆ అవసరాన్ని సూచిస్తున్న 19వ శతాబ్దంలో పెట్టుబడి ప్రవేశించిన ప్రాంతాలలో ఈ రకం సంస్కరణ ధ్వనులు వచ్చాయి. బెంగాల్‌లో ఈశ్వరచంద్ర విద్యాసాగర్, ఆంధ్ర కోస్తాలో కందుకూరి అందుకుదాహరణలు.

ఈ పరిణామాల ఫలితంగా గ్రామీణ ఆర్థికవ్యవస్థలోనూ, నగర జీవితంలోనూ మార్పులు వచ్చాయి. అప్పటిదాకా ఉన్న కుటుంబవ్యవస్థ ఆ ప్రభావాలకి గురి అయింది. ఉదాహరణకు ఉమ్మడికుటుంబం ఇలాగే చితికిపోయింది. తర్వాత కాలంలో

ఇప్పటిదాకా - కుటుంబ రూపంలోనూ, నిర్మాణంలోనూ మార్పులు వస్తూనేఉన్నాయి. అన్నింటిని చర్చించడం ఈ సమీక్ష పరిధిలో సాధ్యం కాదుగానీ, రెండు ముఖ్యమైన విషయాల్ని ప్రస్తావిస్తాను.

భూమినుండి వచ్చే అదనపు మొత్తాన్ని ఉత్పత్తేతర కార్యకలాపాల్లో ఖర్చు చేయడం భూస్వామ్య సమాజ లక్షణం. ఈ అదనపు మొత్తం రాజ్యంమీదా, మతం మీదా, ఆ తర్వాత సెక్స్, భోగం స్త్రీలమీద ఖర్చయింది. (మూడవది మధ్యయుగాల నుండి మరీకొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. మనకు అది ప్రబంధసాహిత్యకాలం) అందులో భాగంగా ఈ అదనపు మొత్తాన్ని అనుభవించే వర్గాలకి సుఖాన్నివ్వగల స్త్రీ అవసర మయింది. సౌందర్యం, ఆకర్షణశక్తిగల స్త్రీలు కావాల్సివచ్చారు. అయితే భూస్వామ్య సమాజంలో ఆ రకం స్త్రీలు కుటుంబవ్యవస్థ బయటే ఉండిపోయారు. కుటుంబస్త్రీలకు ఈ ఆకర్షణశక్తి అవసరంలేదు. పురుషుడి కళ్ళకు కోరికలకి అనుగుణంగా స్త్రీ కన్ప డాలని శాసించే ఈ 'సౌందర్య దృక్పథం' పెట్టుబడి ప్రవేశించిన తరువాత కుటుంబ వ్యవస్థలో కూడా ప్రవేశించింది.

స్త్రీ సౌందర్యం పెట్టుబడికి మూడు రకాలుగా అవసరమయింది. మొదటిది స్త్రీ శ్రమనేకాక శరీరాన్ని సరుకుగాచేసి అదనపువిలువను పొందడంకోసం స్త్రీ సౌందర్యం అవసరమయింది. ఈ స్త్రీ శరీరశ్రమ (వేశ్యా గృహాలు, పెద్దింటి హోటళ్ళల్లో నృత్యాలు వగయిరా) కొన్ని కోట్లరూపాయల పెట్టుబడి ప్రవహించే పరిశ్రమ అయింది. రెండవది స్త్రీని సౌందర్యవంతులుగా తీర్చిదిద్దేందుకు అవసరమైన సాధ నాలు (ఉదాహరణకి కాస్మెటిక్స్) ఉత్పత్తిచేసే మరో భారీపరిశ్రమ కోసంకూడా స్త్రీ సౌందర్యం పెట్టుబడికి అవసరమయింది. మూడవది తాను ఉత్పత్తి చేసిన అదనపు విలువను గ్రహించడం (realisation) కోసం స్త్రీ సౌందర్యం పనికొస్తుంది. మార్కెట్‌లో వస్తువుల్ని అమ్మడంకోసం స్త్రీ ఎలా ఉపయోగపడ్తుందో మనకు తెలి సిందేగదా. పెట్టుబడి తన ఈ అవసరాల కోసం "స్త్రీలు పురుషులకి ఆకర్షవంతంగా కన్పడాలి" అన్న కొత్త సామాజిక విలువను ప్రవేశపెట్టింది. అది ఇప్పుడు ఎంత మాత్రం వేశ్యలకు మాత్రమే పరిమితమయింది కాదు. అందరి స్త్రీలకు వర్తించే దయింది. ఆకర్షణీయంగా ఉండటం అన్న మనోలక్షణం ఆదర్శ స్త్రీ నమూనా తోడ యింది. కళాసాహిత్య రంగాలలో ఈ నమూనా స్త్రీ కి మేజికి పెద్ద పేరు లభించింది.

ఇప్పుడు స్త్రీని తయారుచేసే క్రమంలో కుటుంబవ్యవస్థ స్త్రీని ఆకర్షవంతంగా

తీర్చిదిద్దడంకూడా ఒక పనిగా నిర్వహిస్తుంది. నల్లగావుండే స్త్రీలను చిన్నచూపు చూడటం, అందంగా అలంకరించుకోవడం, శరీరం కనులకింపుగా రూపొందించుకోవాలనుకోవడం ఇవన్నీ ఈ సామాజిక విలువలో భాగమే. అయితే కుటుంబాన్ని స్త్రీని నిర్దేశించే భూస్వామ్య నీతినియమాల పరిధిలో ఈ ఆకర్షణీయతకు కొన్ని లక్ష్మణరేఖలుంటాయి. అవికూడా మారుతు ఉండచ్చు. కాని మొత్తంగా పురుషుడి అవసరాలకి, సుఖాలకు అనుగుణంగా స్త్రీని రూపొందించే క్రమంలో ఈ ఆకర్షణీయత ఒక భాగం అయిపోయింది. అదికూడా కుటుంబం ద్వారానే సాధించబడ్తోంది.

పెట్టుబడి ప్రవేశించినతరువాత రెండవమార్పు ఉత్పత్తిలోనూ దాని అనుబంధ కార్యకలాపాల్లోనూ ఎక్కువగా స్త్రీలు ప్రవేశించడం, నిజానికి ఉద్యోగాలలో, సామాజిక జీవితంలో పాల్గొంటూ అభివృద్ధిక్రమంలోకి స్త్రీలు ప్రవేశించడం సమాజంలో స్త్రీ స్థానం పెరిగిందనడానికి ఉదాహరణగా కూడా చెప్తుంటారు. ముందు ఇక్కడ మనం రెండు విషయాలు గమనించాలి. మొదటిది పెట్టుబడిదారీ దేశాలలో లాగే ఇక్కడకూడా ఆధునిక సాంకేతిక శ్రమవిభజన స్త్రీ పురుషుల మధ్య అసమానతలను మరింత బలోపేతం చేసింది. రెండవది వలస (అర్ధవలస) దేశాలలో పెట్టుబడి ప్రవేశించి ఉత్పత్తి క్రమంలోనుండి అనుభవం, నైపుణ్యంలేని శ్రామికులను బయటికి విసిరేసినప్పుడల్లా ముందుగా నష్టపోయేది స్త్రీయే. మనదేశంలో ఆర్థికాభివృద్ధి క్రమమంతా స్త్రీలను నిరుద్యోగులను చేసే క్రమమే. 1951 నుండి 1981 దాకా వేసిన లెక్కల ప్రకారం శ్రామిక జనాభాలో స్త్రీలశాతం క్రమంగా తగ్గుతూ వస్తోంది. మన ఆర్థికాభివృద్ధి క్రమానికున్న ఈ స్త్రీ వ్యతిరేక లక్షణాన్ని దృష్టిలో పెట్టుకొంటూ అభివృద్ధి క్రమంలోకి వచ్చిన స్త్రీల "అభివృద్ధి"ని, అందులో కుటుంబవ్యవస్థ పాత్రను పరిశీలిద్దాం.

ఇంటి బయట సామాజిక జీవితంలోకి ప్రవేశించడం అంటే మన సమాజంలో స్త్రీలు రిస్క్ తీసుకోవడమే. రాత్రి పూట దేశమంతా స్త్రీలపై ఉండే కర్ఫ్యూ సంగతటుంచి, పగలుకూడా స్త్రీలకు సమాజంలో భద్రతలేదు. ఈ భద్రతా రాహిత్యం బయట పనిచేసే స్త్రీల జీవితాల్ని నిరంతరం వెన్నాడే నీడ. కాగా ఆ స్త్రీలు చూపుల నుండి మాటలదాకా కట్టుకథల నుండి దుష్ప్రచారాలదాకా అనేక రూపాలలో జరిగే అవమానాలతో బతకడంనేర్చుకోవాలి ఈ ప్రమాదాన్ని, అవమానాన్ని ఎదుర్కొంటూ అలిసి సొలిసి ఇంటికొచ్చి ఆదాయం అంతా పురుషుడి చేతిలోపెట్టి ఇంటి చాకిరీలో

మునిగిపోతుంది స్త్రీ. ఆ రకంగా ఉద్యోగంచేసే స్త్రీ ఉన్న శ్రమకు దోపిడికి తోడుగా అదనపు శ్రమచేసి అదనపు దోపిడికి గురి అవుతుంది. మన వ్యవస్థలో పనిగంటల రీత్యా అత్యధిక దోపిడికి గురి అవుతున్నది ఈ స్త్రీనే. అందుకు సాధనం పితృస్వామిక కుటుంబవ్యవస్థ.

ఆ రకంగా స్త్రీపై పురుషుడి ఆధిపత్యాన్ని స్థాపించి, పురుషుడి అవసరాలకి అనుగుణంగా స్త్రీని తీర్చిదిద్దుతూ, తననుతాను పునరుత్పత్తి చేసుకునే సాధనంగా సాగుతూ వస్తున్న పితృస్వామిక కుటుంబ వ్యవస్థ సమాజంలో వచ్చిన మార్పులతో మరింత దోపిడికి ఆధిపత్యానికి స్త్రీని బానిసని చేసింది.

ఈ స్థితినుండి స్త్రీ బయటపడేదెలా ? ఏ కుటుంబవ్యవస్థ స్త్రీ బానిసత్వానికి కారణమో, ఆ కుటుంబవ్యవస్థే స్త్రీ చైతన్యాన్ని నిరోధిస్తుంది కూడా. సామాజిక సమస్యలమీద సామూహిక కార్యాచరణ చైతన్యానికి కారణమవుతుందని మనం గుర్తిస్తాం. అయితే ఆ రకం సామూహిక కార్యాచరణకు కుటుంబవ్యవస్థ అవకాశమివ్వదని కూడా మనం గుర్తించాలి. ప్రతి స్త్రీకి తన సమస్యలు తన వ్యక్తిగత కుటుంబ సమస్యలుగానే మిగిలిపోతాయిగాని పొరుగింటి స్త్రీతోకలిసి కుటుంబవ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడే సౌకర్యం ఉండదు. అందుకనే సమాజంలో స్త్రీ విషయంలో అభ్యుదయకరమైన మార్పులు కుటుంబాల బయటనుండే శక్తులవల్ల వస్తాయనేభావన స్థిరపడింది. ఆపని తాము నిర్వహిస్తామనే సంస్కరణ వాదంతో బయల్దేరే పురుషుల పని అయింది. స్త్రీ విముక్తి పురుషుల సంస్కరణ వాదంమీద ఆధారపడి జరిగేదేగాని స్త్రీ చైతన్యం చోదకశక్తిగా నడిచేదిగా కన్పడదు. ఈ పరిస్థితే కొనసాగితే స్త్రీలకు విముక్తి అంటూ ఏమీ ఉండదు. కాస్మొటిక్ అభివృద్ధి తప్ప, ప్రస్తుతం మనదేశంలో జరుగుతున్నది ఇదే.

అందుకే ఈ సమస్యకు మూలమయిన కుటుంబవ్యవస్థ గురించి, దాని సామాజిక చారిత్రక పునాదిగురించి అధ్యయనం చేయడం అవసరమవుతోంది. ఆ అధ్యయనానికి, శాస్త్రీయ విశ్లేషణకు మార్క్సిజం మినహా వేరే శాస్త్రంలేదు. అందుకే కుటుంబ వ్యవస్థ గురించి పట్టించుకోవాల్సిన బాధ్యత కమ్యూనిస్టులమీద వుంది.

స్త్రీ విముక్తి, కుటుంబవ్యవస్థ మొదలైన విషయాలు ఇప్పుడు కమ్యూనిస్టులు పట్టించుకుంటే అది ఉద్యమాన్ని ఎలా పక్కదారి పట్టిస్తుందో వివరిస్తూ చాలా వాదనలు వినవచ్చాయి. వాటికి ఈ రచయిత్రి మెచ్చుకోదగ్గ ఓపికతో సమాధానం కూడా

చెప్పారు. నేనుమాత్రం పట్టించుకోకపోతే ఏమవుతుందో ప్రస్తావిస్తాను.

ఆచరణలో సమాజంలో ఏ సెక్షన్ అయినా విప్లవోద్యమంలో పాల్గొనడం ద్వారా తమ చైతన్యాన్ని, జీవన స్థితిగతుల్ని, సమాజంలో తమ స్థానాన్ని మెరుగు పరుచుకోవడం సాధ్యమవుతుందని విశ్వసించినపుడే ఉద్యమంలో భాగం అవుతారు. విప్లవోద్యమంలో స్త్రీలను విస్తృతసంఖ్యలో భాగం చెయ్యాలంటే స్త్రీ సమస్యలమీద విప్లవోద్యమానికి కార్యాచరణ ఉండాలి. (మన సంఘాలలో స్త్రీలు అతి తక్కువ శాతంలో ఉండటం కొట్టొచ్చినట్టు కన్పిస్తుండటానికి బహుశా ఇదే కారణం కావచ్చు) అయితే స్త్రీ సమస్యను లేవనెత్తితే అది ఉద్యమంలో ఉన్న పురుషులలో అసంతృప్తిని వ్యతిరేకతను అనివార్యంగానూ కలుగచేస్తుంది. పురుషులలో ఈ విషయంపై అవగాహనను ఓపికగా పెంపొందించడం ద్వారానూ, నిర్మాణంలో ప్రజాస్వామికత ద్వారానూ, ఆచరణలో పట్టువిడుపులతోనూ ఆ వైరుధ్యాన్ని పరిష్కరించుకోగలగాలి. అలాకాక ఈ వైరుధ్యానికి భయపడి సమస్యను పట్టించుకో నిరాకరిస్తే విప్లవోద్యమంలో స్త్రీల పాత్ర వెనకపడే ఉంటుంది. అప్పుడు స్త్రీలను ఉద్యమంలో ఆకర్షించడానికి కుటుంబవ్యవస్థ మీదే ఆధారపడాల్సి వస్తుంది. సి.పి.ఐ, సి.పి.ఎమ్ మహిళా సంఘ నాయకులందరు సి. పి. ఐ, సి. పి. ఎమ్ పార్టీనాయకుల భార్యలయినట్టు. అది కుటుంబవ్యవస్థను మరింత పటిష్టం చేస్తుంది.

ఇక్కడ మరో విషయం గమనించాలి. ఒక పోరాటంలో స్త్రీలు పాల్గొనడమే స్త్రీ విముక్తి చైతన్యానికి ఉదాహరణ కాలేదు. స్త్రీలు తాము అనుభవించిన పీడన గురించి చైతన్యవంతులయినపుడే అది స్త్రీ చైతన్యానికి సూచిక అవుతుంది. స్త్రీలు ఉద్యమంలోకి రావడం విస్తృతార్థంలో వాళ్ళ పోరాట చైతన్యానికి సూచిక. అది స్త్రీ విముక్తి చైతన్యానికి మొదటిమెట్టు మాత్రమే. కాని అదే స్త్రీ విముక్తి చైతన్యం కాదు, కాలేదు. ఈ మౌలికమైన తేడాను గుర్తించకపోతే (రేణు చక్రవర్తిగారు కమ్యూనిస్టు ఉద్యమంలో స్త్రీలపాత్రగురించి ఒక పుస్తకంరాసి, దానికి స్త్రీ ఉద్యమంలో కమ్యూనిస్టు పాత్ర" అనే శీర్షికపెట్టారు !) సమాజంతో పురుషాధిక్యతతో సహా అన్ని దోపిడులకు వ్యతిరేకంగా నడిచే విప్లవం అసంపూర్తిగానే మిగిలిపోతుంది. స్త్రీలలో చైతన్యం అక్కడే ఆగిపోతే ఊరేగింపు అయిపోయిన వెంటనే ఇంటికివెళ్ళి కామ్రేడ్ భర్తకు వెట్టిచాకిరి చేయడంతో ఆ చైతన్యం ముగుస్తుంది. అందుకే స్త్రీలనూ, వాళ్ళతోపాటు పురుషులను స్త్రీ సమస్యమీద సమీకరించడం విప్లవోద్యమానికి అవసరం.

స్త్రీ సమస్యను, కుటుంబ వ్యవస్థను పట్టించుకోకపోవడం వల్ల విప్లవోద్యమంలో మానవ సంబంధాలకి కూడా ఒక నష్టం. భారత కమ్యూనిస్టు ఉద్యమంలో కరకమైన హిపోక్రసీవల్ల నీతి వికృతీకరించబడి స్త్రీ పురుషసంబంధాల విషయంలో అవాంఛనీయ ధోరణులకు దారితీసిన సంఘటనలు చాలావున్నాయి. విచిత్రమైనవిషయమేమిటంటే రాజకీయాభిప్రాయాల్లోనూ సూటిగానూ, దృఢంగానూ ఉండటం ఒక ఉన్నత లక్షణంగా భావించే ఉద్యమమే సామాజిక విలువల విషయంలో వాస్తవ దృక్పథంలో - హీనాతిహీనమైన ప్రజలకు ఆమోదాన్నిచ్చింది. బలవత్తరమయిన భూస్వామ్య భావజాలం ఉద్యమం లోపల రాజ్యమేలుతుంటే ఉపేక్షించి ఊరుకుంది. సమాజానికి ఏ ప్రజా ఉద్యమమైనా మానవ సంబంధాల ప్రజాస్వామికీకరణకు తోడ్పడుతుంది. ఉద్యమంలో పాల్గొనే మనుషులమధ్య, స్త్రీ పురుషులమధ్య సమానత్వ ప్రాతిపదికగా స్నేహం ఏర్పడే అవకాశం కలుగుతుంది. అయితే అదే సమయంలో ఉద్యమంలో అనివార్యంగానే ఉండే భూస్వామ్య భావజాలంతోనూ, కట్టుబాట్లతోనూ సైద్ధాంతిక పోరాటం సాగుతూవుండాలి. లేకపోతే నూతన ప్రాతిపదికగా ఏర్పడే మానవ సంబంధాలు తప్పుగానూ, అసహజంగానూ, అవినీతిగానూ వాళ్లుభావించో, ఇతరులు భావించో పక్కదారి పడ్తాయి. ఉద్యమంలో ఏర్పడే శాస్త్రీయ ప్రజాస్వామిక చైతన్యానికి అధిపత్యంలో కొనసాగే భూస్వామ్య భావజాలానికి మధ్య వైరుధ్యంలో పడినలిగి మానవ సంబంధాలు వికృతకొంచబడ్తాయి. ఈ ధోరణిని ఎదుర్కోవాలంటే స్త్రీ సమస్యలపైనా - కుటుంబవ్యవస్థ పైనా ప్రత్యేక శ్రద్ధతో ఆచరణ కార్యక్రమాన్ని చేపట్టాలి.

ఈ కారణాలన్నింటిదృష్ట్యా స్త్రీ సమస్యపై ఆచరణ కార్యక్రమాన్ని చర్చను వ్యతిరేకిస్తున్న వాళ్ళు విప్లవోద్యమానికి తీవ్రమయిన నష్టాన్ని కలిగిస్తున్నారని అందరూ గుర్తించాలి.

అందుకే స్త్రీ సమస్యపై విప్లవోద్యమంలో చర్చకు దోహదపడే ఈ ప్రసంగ వ్యాసానికి మనం ఆహ్వానం పలుకుతాం. ఆచరణా, సిద్ధాంతం ప్రాథమిక స్థాయిలో ఉండటంవల్ల వచ్చిన పరిమితులలో కుటుంబవ్యవస్థను విశ్లేషించడానికి ఈ ప్రసంగ వ్యాసం మొదటిమెట్టు. అయితే విశ్లేషించడానికి సామర్థ్యమే కాదు, సాహసం కూడా కావాలి. అందుకు రచయిత్రి ఓల్గాకు ప్రచురించిన విప్లవ రచయితల సంఘానికి అభినందనలు.

SRJANA Telugu Monthly June 1985 H/HNK-3
Regd. No. with Registrar of Newspapers 10953/67

# తెలుగు దేశం ప్రభుత్వ నరమేధం - 1985

| | | | |
|---|---|---|---|
| 1. | భైరి గంగారాం | పెంబట్ల (జగిత్యాల) | 21, జనవరి |
| 2. | అర్సపల్లి వెంకటేశ్వరరావు | వీరభద్రారం (భద్రాచలం) | 28, మార్చి |
| 3. | గొట్టి రఘుపతి | వెంకట్రావుపేట (కొండాపూర్) సిరిసిల్ల | 11, ఏప్రిల్ |
| 4. | పాన్ సత్తయ్య | | |
| 5. | బందా గంగయ్య | | |
| 6. | వుప్పుల లక్ష్మిరాజ్యం | | |
| 7. | రాడు రాజయ్య | | |
| 8. | రెడ్డి మల్లి బాబు | బస్వాపూర్ (దోమకొండ) | 1, మే |
| 9. | రాజనర్సు (శంకర్) | | |
| 10. | సిద్దయ్య | బొమ్మిరెడ్డిపల్లి (సుల్తానాబాద్) | 6, మే |
| 11. | రాయలింగు | | |
| 12. | పులి మధునయ్య | లోడ్‌పల్లి (కాగజ్‌నగర్) | 14, మే |
| 13. | అంకోపి రమేష్ | | |
| 14. | జి. నారాయణ | చిననక్కలపల్లి (జగిత్యాల) | 26, మే |
| 15. | సారయ్య | నర్సాపూర్ (ములుగు) | 28, మే |
| 16. | భూపతిరెడ్డి | | |
| 17. | గోవిందరెడ్డి | జగిత్యాల | 28, మే |
| 18. | ఓడెపు రాములు | జగిత్యాల | 10, జూన్ |

కస్టడీ మరణాలు :

| | | | |
|---|---|---|---|
| 19. | సారంగపాణి | వరంగల్ | 21, జనవరి |
| 20. | భూక్యా కిషన్ | కామారెడ్డి | 7, ఏప్రిల్ |
| 21. | అమర్‌నాథ్ నరసింహారెడ్డి | కామారెడ్డి | 15, మే |

SRJANA
Hanumakonda 506 001.
Single copy Rs. 3/-
Yearly Subscription Rs. 30/-